# తెలుగు స్వతంత్ర

## విషయసూచిక

తెలుగు విశ్వవిద్యాలయ
గ్రంథాలయం

సంపుటి 1. సంచిక 44
శుక్రవారం, జూన్ 3, 1949

నమోదు సంఖ్య.... .... .... .... ....
తేది.... .... .... .... .... .... ....

ముఖచిత్రం—సినీ తార కుమారి
సంపాదకీయం ... ... 3
విశ్వవిద్యాలయం: వ్యావహారికభాష—
గుంటుపల్లి రాధాకృష్ణమూర్తి ... 5
గిరీశం పెట్టిన ఒరవడి—
ప్రో. సోమేశ్వరరావు ... ... 8
అభ్యుదయ వ్యవసాయానికి అష్టవిధ
సూత్రాలు—తాడిమళ్ళ జగన్నాథరావు 9
మార్క్సిజమ్ వైజ్ఞానిక వాదమా ?—
"సామాన్యుడు" ... ... 11
పారిపోయిన కుక్క—అంగర వెంకట
కృష్ణారావు ... ... 15
విజయనగర సామ్రాజ్యము (చరిత్ర)—
డా. నేలటూరి వేంకటరమణయ్య ... 17
చెల్లుపెట్టిన బాకీ (కథానిక)—
'హితశ్రీ' ... ... 23
ఆధ్యాత్మిక బోధనలా ఇప్పుడు
కావలసింది? యన్.యస్. నారాయణ 26
పరబ్రహ్మం తత్వం (కథానిక)—
'మాన్స" ... ... 29
హైరా (కథానిక)—
స్నేహలతా సేన్ ... ... 32
చరమాచ్ఛాదనం—ప్రేమ్‌చంద్ ... 36
యజ్ఞపశువు (కథానిక) మా. గోఖలే... 41
కాలప్రభావం—పెనుమాక రాధా
కృష్ణమూర్తి ... ... 45
జనవాక్యం ... ... 48



బేగమ్ ఆలీఖాన్ (రీటాహేవర్త్)

ప్రఖ్యాత హాలీవుడ్ సినిమానటి రీటా హేవర్త్ ఇటీవల ప్రిన్సు ఆలీఖాన్‌ను (ఆగాఖాన్ కుమారుడు) వివాహం చేసుకున్నది.

తెలుగు స్వతంత్ర

సంపుటి-1 జూన్ 3, 1949 ప్రచురణ:
సంచిక-44 ప్రతి శుక్రవారం

# దిగుమతులు : అధికచలామణీ

దేశంలో ప్రబలంగా క్రమ్ముకున్న అధిక చలామణీకి ఒక ముఖ్య కారణం ఇండియాపేరిట ఇంగ్లండులో ఉన్న స్టెర్లింగు నిలువలని కేంద్రప్రభుత్వవర్గాల అభిప్రాయం. గడచిన యుద్ధకాలంలో మనదేశంనుండి ఎగుమతి అయిన వస్తువులకు బ్రిటన్ బంగారం రూపంలో ఖరీదు యిచ్చియుండవలసింది. కాని ఆవిధంగా జరిగియుండలేదు. తత్ఫలితంగా అప్పటి ఇండియా ప్రభుత్వం కాగితపు కరెన్సీని విపరీతంగా పెంచివేసింది. వెండి బంగారాలు కూడా హద్దుమీరి ఎగుమతి అయాయి. రెండు విధాలా భారతదేశం అపారనష్టం అనుభవించింది.

అందువల్ల నేడు ఇంగ్లండునుండి భారీ యెత్తున విలాసవస్తువులు ఇండియాకు దిగుమతి అవుతున్నాయి. ఇండియా పేరిట అక్కడ ఉన్న స్టెర్లింగు నిలువలనుండి అవి కొనబడుతున్నాయి. కేంద్ర ప్రభుత్వం ఈ దిగుమతులను అరికట్టడానికి బదులు ప్రోత్సహిస్తూ, అధిక చలామణీ తగ్గించడానికి అదొకమార్గమని వివరించింది. క్లిష్టతరమూ, దుర్భరమూ అయిన ఏదేశపు ఆర్థిక వ్యవస్థ అయినా, విదేశాలనుండి ముమ్మరంగా వస్తువులు దిగుమతిచేసుకోనడంవల్ల చక్కబడదు. ఇండియాకు స్టెర్లింగు నిలువలేనినాడు, యీ దిగుమతి విధాన ఫలితంగా దేశంలోని అధికధనం విదేశాలకు ప్రవహించి వుండవలసింది. ఆర్థిక వ్యవస్థకు అంతకంటె ప్రమాదకరమైనది ఇంకొకటి లేదు.

విదేశాలనుండి దిగుమతి అయిన ఈ విలాసవస్తువులు, తయారీ వస్తువులు దేశపు మార్కెటులన్నీ నిండి, యే పరిణామాలకు దారితీస్తాయి? ఆ ప్రశ్నకు సమాధానం అటువంటి వస్తువులు ఏ తరగతికి చెందినవారి అవసరం తీరుస్తాయన్న విషయంపై ఆధారపడి ఉంటుంది. యుద్ధానికి పూర్వం, ధనికవర్గానికి చెందినవారు, ఉన్నత వేతనాలను అనుభవించే ప్రభుత్వోద్యోగులు – వీరే సాధారణంగా దిగుమతి వస్తువులను ఆదరించేవారు. నేడు విదేశ వస్తువుల చలామణీ ఎన్నో రెట్లు పెరిగింది. దాని అర్థం సామాన్య ప్రజానీకానికి వాటిని కొనగలిగిన శక్తి లభించినదని కాదు. యుద్ధకాలంలో వ్యాపారంవల్ల అధిక లాభాలు గణించిన కొత్త ధనికవర్గం ఒకటి దేశంలో ఉద్భవించింది. కాంగ్రెస్ ప్రభుత్వాలు అధికారంలోకి వచ్చిన తరవాత, వేలకొద్దీ కొత్త ఉద్యోగాలు సృష్టింపబడ్డాయి. అందులో అధికభాగం ఉన్నత వేతనాలు కలవే. ఈ ఉద్యో

గాలు ఎంతవరకూ సక్రమ పరిపాలనకు అత్యవసర మనేది అప్రస్తుత విషయం. విదేశ వస్తువులను ఆదరించే సరికొత్త తరగతి మొలకలెత్తిందని నిరూపించడానికే. అదికాక, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు స్వయంగా అనేక పరిశ్రమలు ప్రారంభించాయి. ఈ పరిశ్రమల నిర్వహణను కంట్రాక్టు తీసుకున్న సంస్థలూ, వ్యక్తులూ అపారమైన లాభాలు ఆర్జిస్తున్నారు. ఈ రకంగా కొనుగోలుశక్తి కొన్ని వర్గాలలో విపరీతంగా పెరిగింది. వీరి విదేశవస్తువుల ఆదరణ దేశంలోని అధిక చలామణీ అరికట్టాలనే మహాదాశయంవల్ల జనించినదిమాత్రం కాదు.

ప్రభుత్వవాదన అంగీకరిస్తే, దిగుమతిదారుల జేబులు నింపడంవల్లా, విదేశ పారిశ్రామికుల లాభాలు అధికం చెయ్యడంవల్లా, స్థానికమైన అధిక చలామణీ ఎలాతగ్గుతుందో ఊహించ అలవికానిది. ఉన్నత వేతనాల ఉద్యోగులూ, తదితర ధనికవర్గం, వీరి కొనుగోలుశక్తిలో ఏమాత్రం మార్పురాదు. కాక, సుదూరంలో ధనిక వర్గాలపై ప్రభుత్వం పన్నులు హెచ్చిస్తుందనే ఆశసైతం లేదు.

స్టెర్లింగు నిలువలు నిజానికి భారత దేశపు బీదప్రజానీకానికి చెందినవి. యుద్ధకాలంలోని మిత్రరాజ్యాలు విజయం పొంది ప్రజాస్వామికం నిలబెట్టే నిమిత్తం, భారతీయ ప్రజానీకం అర్థనగ్నంగా, పూర్తి ఆకలితో ప్రాణాలు గడుపుకుని, మిత్ర రాజ్య సైన్యాలకు ఆహారం, వస్త్రాలు మొదలుకొని సమస్త వస్తువులూ సరఫరా చెయ్యడానికి తోడ్పడ్డారు. ఈనాడు విదేశ విలాస వస్తువులను ఆదరించి అనుభవిస్తున్న ధనికవర్గాలవారు ఆనాడు స్టెర్లింగు నిలువలు అధికం చెయ్యడానికి చేసిన త్యాగం ఏమీలేదు. తక్కిన ప్రజానీకం యుద్ధకాలపు కష్టనష్టాలను ఎదుర్కొని, ఇండియా జాతీయఋణాన్ని తీర్చివేసి, స్టెర్లింగుద్వారా ఇంగ్లండు దేశమే ఇండియాకు ఋణపడేటట్లు చేశారు. ఈసత్యం దృష్టిలో ఉంచుకునే, స్టెర్లింగు నిలువలను యంత్రాల దిగుమతికోసం వినియోగించడానికి ఆదిలో కేంద్ర ప్రభుత్వం ఉద్దేశించింది. యంత్రాల దిగుమతిద్వారా దేశంలో ఉత్పత్తి అధికం చేసి, తయారీ వస్తువులు అందరికీ అందుబాటులో ఉండేపరిస్థితి కల్పిస్తే ఆర్థిక వ్యవస్థ చక్కబడుతుంది. అలాకాకుండా విలాసవస్తువుల దిగుమతికోసం స్టెర్లింగు నిలువలను వ్యయపరుస్తే, అది ధనికవర్గాలకూ, దిగుమతిదారులకూ మాత్రమే లాభకరంగా పరిణమిస్తుంది.

కేంద్ర ప్రభుత్వపు వాణిజ్య శాఖ అనిర్వచనీయమైన ప్రమత్తతవల్ల యీ విదేశ విలాస వస్తువుల దిగుమతి ప్రోత్సహిస్తూ, మిాదుమిక్కిలి అధిక చలామణీ తద్వారా తగ్గుతుందనే సాకుచెప్పడం సాహసకరం. కొన్నివర్గాలకు మాత్రమే ఉపకరించే ఆర్థిక ప్రణాళికలూ విధానాలూ వీటిని అనుసరించడానికి నేడు ప్రభుత్వం ఎన్నిసార్లయినా విసుగు లేకుండా ఒకే ఒక కారణం వివరిస్తున్నది — అధిక చలామణీ. ద్రవ్యం కంటే యీ సంజాయిషీయే నేడధికంగా చలామణీ అవుతున్నది.



# విశ్వవిద్యాలయం : వ్యావహారిక భాష

గుంటుపల్లి రాధాకృష్ణమూర్తి

కాలగమనంలో ప్రతిభాష కొద్దిగానో గొప్పగానో మారితీరుతుంది. మార్పు సృష్టికే నైజం. ఆవిధగానే తెలుగుభాషకూడా నానాటికీ మార్పుచెంది, వివిధపరిణామాలను పొందింది. ఈ మార్పు ఒక ప్రత్యేక ప్రస్ఫుటాకారాన్ని చేకూర్చుకున్నది, దాదాపు ఒక శతాబ్దంనుంచే. ఇది ముఖ్యంగా సంస్కృత నాటక కావ్యాలను అనువదించ బూనిన ఆంధ్రకర్తలను అడ్డు తగిలింది.

అప్పటిలో భాషానాళికి విస్పష్టంగా మూడు పాయలై ప్రవహించింది: (1) శుద్ధగ్రాంధికము. (2) శిష్టవ్యావహారికము, (3) కేవల గ్రామ్యము. ఈ మూడింటికీ సంస్కృత దృశ్యకావ్యాలే ప్రాతిపదికలని చెప్పవచ్చు. గీర్వాణ నాటకాలలో రెండు స్పష్టమైన భాషలు ఉపయోగింపబడి ఉన్నై. అవి (1) గ్రాంధికము, (2) ప్రాకృతము సంస్కృతాలంకారికులు ఉత్తమపాత్రలకు గ్రాంధికాన్నీ, మధ్యమనీచపాత్రలకు ప్రాకృతాన్నీ నియమించారు. ఈభాషావిభేదాలు పాత్రౌచిత్యపరిపోషణకు తోడ్పడుతై.

పదేళ్ళ క్రితం నేటి సాహిత్యంలో సగపాలున్నారో లేదో వ్యావహారిక వాదులు. అయినా, ఇప్పటికీ కవులూ, గ్రంథకర్తలూ అనేకులు గ్రాంధికవాదులే. అయినప్పటికీ, వీరు గ్రామ్యాన్ని దూషింపరు. నిజానికి. నిత్యజీవితంలోనైనా ఆప్తమైన దేశభాషను వాడకుండా ఎవ్వరూ ఉండరు. ఇది అలనాటి శ్రీకొక్కొండవారి కొక్కరికే అన్వయించదను కుంటాను. అయితే, పండిత చర్చలలోనూ సాహిత్య గోష్ఠులలోనూ, గ్రంథ రచనలోనూ ఎక్కడలేని గ్రాంధిక భాషాగరిమా కాపాడబడుతుంది. అందుకని గ్రాంధికాన్ని దూషించరు. గ్రాంధికం ఎలాగూ వంద్యమే-ఎందుకంటే అది కవుల రచనాకోరణి కాబట్టి, అది తెలుగు సాహిత్య సౌధానికి పునాదిరాయి కాబట్టి. అయితే, ఈ తెలుగుభాషే కొద్దిమార్పులతో అవతరిస్తే, ఎందుకు దూష్యం అవుతుందో బోధపడదు.

ఏనా, ఈ వాదవివాదాలు విశ్వవిద్యాలయం దాకా రాలేదు. ఒకానొక మిత్రులన్నట్లు ప్రపంచం ఎంత అభ్యుదయాన్ని పొందినప్పటికీ ప్రపంచపౌర శిక్షణాలయం- విశ్వవిద్యాలయం మాత్రం ఇంకా కాస్త సనాతన వాదస్ఫూర్తితోనే వ్యవహరిస్తుంది. ఇది సాహసవాక్యమే అయినప్పటికీ, నిజమే. పాత్రోచితభాషాప్రయోగం గల తెలుగునాటకాలూ, నవలలూ విశ్వవిద్యాలయ సింహద్వారాన్ని చేరటానికి ఎన్నోతిప్పలపాలవుతున్నాయనేది దీనికి తార్కాణం. సనాతనపండితులైనా దేశ్యాన్ని ఆమోదించిన ఘట్టాల ఉదాహరణ లుంటాయేమో గాని, విశ్వవిద్యాలయం మాత్రం దీనినామోదించే సూచనలు మసకగా కూడా కనుపించవు.

నిజానికి గ్రాంధికానికీ, వ్యావహారికానికీ సనాతనులు భయపడేటంత దూరం ఉన్నదా ? రెండూ తెలుగుభాషా భాగాలే. అయితే, గ్రాంధికం వ్యాకరణ సూత్రబద్ధమై, సమాసాలంకార నియమబద్ధమై విలక్షణలక్షితమై ఉంటుంది. కానీ, వ్యావహారికానికి ఇన్ని కట్టుబాట్లు లేవు. వీనులకు విందుగా సోకే వాక్యనిచయసంచాలనంలో తప్పేమీలేదనే వాదం మీద ఇది అల్లబడుతుంది. అయితే సాహిత్య పరిషత్తువారు శిష్టవ్యావహారికమనే పేర దేశ్యాన్ని ఆమోదించారు. నేననేది—ఇటువంటి ప్రత్యేక లక్షణ లక్షితమైన శిష్టవ్యావహారికాన్ని గురించే. ఆలోచించిచూస్తే, ఈ రెంటికీమధ్య పెద్ద అఖాతం ఉండదు. గ్రాంధిక ప్రయోగంవల్ల ఎటువంటి సన్నివేశాలలో ఎటువంటి రసాలను చిలికించవచ్చో, అటువంటి ఘట్టాలలో అటువంటి రసాలను వ్యావహారిక భాషా ప్రయోగంవల్ల సుందరతరంగా, మనోహరంగా చిత్రించవచ్చు. దీనికి ఇందాక చెప్పిందే కారణం. గ్రాంధికం బహునియమసూత్రబద్ధం. వ్యావహారికం అలా కాదు.

రెండవదానిలో భాషాస్వాతంత్ర్యం ఉన్నది. ఇదే నవ్యసాహిత్యానికి మెఱుగు దేగల సాధనం.

గ్రాంధికవ్యావహారికాల కుండే సామీప్య సమాలోచన తరవాత, దేశ్యగ్రామ్యాలకెటువంటి సంబంధం ఉందో చూడాలి. సంస్కృతంలో రెండుభాషాభేదాలే స్ఫుటం. మధ్యమనీచపాత్రలిద్దరికీ ప్రాకృతికమే వాడటం అలవాటై పోయింది. కాని, తెలుగు మూడు చక్కని విభాగాలకి వస్తుంది. ఉత్తమాంధ్రదృశ్యకావ్యాలలో ఉత్తమ పాత్రలకు సరళగ్రాంధికాన్నీ, మధ్యమ పాత్రలకు దేశ్యాన్నీ,నీచపాత్రలకు గ్రామ్యాన్నీ సరసంగా ఉపయోగించటానికి తెనుగు కవికి అవకాశా లున్నై. గ్రామ్యం అంటే కొంచెం నీచమైన భాషే. వేదంవారి ప్రతాపరుద్రీయానికి ఇటువంటి భాషా ప్రయోగమే వన్నె దెచ్చింది. అందుకని కేవల గ్రామ్యానికీ, శిష్టవ్యావహారికానికీ చాలా భేదం ఉంది. అది కేవలం నాటక కావ్యాలలో రసస్ఫూర్తికీ, పాత్రౌచిత్యానికీ మాత్రమే అరుదుగా వాడవలసిన భాషకాని, గ్రాంధికానికీ, శిష్ట వ్యావహారికానికీ చాలా సామీప్యం ఉన్నది.

విశ్వవిద్యాలయంలో వ్యావహారిక భాషను ప్రవేశపెట్టటం అవసరమా? అది ఎక్కడ ఎప్పుడు ఎట్లా ప్రవేశపెట్టాలి? ఇది చాలా అవసరమే. ప్రాథమిక విద్యార్థికి కాదు. ఇది ఒక స్థాయిని చేరుకున్న పండిత విద్యార్థికి తప్పకుండా అవసరం. పట్టపరీక్షకు తెలుగునే ప్రత్యేకించి చదివే విద్యార్థికైనా ఇది చాలా అవసరం. వారికి ఉండే తక్కిన పరీక్షలకు తోడు ఒక ప్రశ్నపత్రాన్ని అధునికాంధ్రవాఙ్మయానికి ప్రత్యేకించి ఉంచాలి. అందులో పాఠ్యగ్రంథాలను బోధించటం అంతగా అవసరం కాకపోవచ్చు. అయినప్పటికీ, అవి non-detailed పుస్తకాలలాగ ఉండవచ్చు. ఈవిభాగంలో అధునాతనమైన నవలలూ, గేయాలూ, చిన్నకథలూ ఉంటై. తక్కిన పరీక్షలు విద్యార్థియొక్క శుద్ధగ్రాంధికభాషా పటుత్వాన్ని ఎట్లా పరీక్షిస్తాయో, అట్లాగే ఈ విభాగపరీక్షా పత్రం అతనిశిష్టవ్యావహారిక భాషాదృఢత్వాన్ని పరీక్షిస్తుంది. ఇటువంటి విభాగం యొక్క అవశ్యకత దీనివల్ల స్పష్టమౌతుంది. ఎం. ఏ పరీక్షలో తెలుగులో ఉత్తీర్ణుడైన విద్యార్థి ప్రస్తుత వాఙ్మయపరిణామాలు తెలియవంటే,అది హాస్యాస్పద మయిన విషయం. నేటి తెలుగు పట్టభద్రులెందరో దేశ్యంలో వ్యవహరించటం, వ్యవహరించినట్లు వ్రాయటం తెలియని వారున్నారు.

అదీకాక, ఈ అధునికాభ్యుదయ సాహిత్యం ఒక వికసించని కుసుమపు మొగ్గలాగ వాడిపోవలసిందేనా? విద్యార్థి శ్రీనాథుడిలో శృంగారాన్ని ఆస్వాదిస్తాడు. కాని, వసంతఋతు సౌభాగ్యమృతాస్వాదనకు తన తరగతి గదిదాటి రావలసిందే. అదికాకపోయినా, ఈ అర్భకుడు ఎప్పుడు తెలుసుకుంటాడు - తెలుగు కిన్నెర క్రొన్నడల చిన్నెలను? అయితే, ఈ నవ్యసాహితీఖని తొలిమి బంగారు సంపదను చూడకుండా, అభ్యుదయ వాఙ్మయ కుసుమ సౌరభ్యాన్నీ, మకరందాల మాధుర్యాన్నీ ఆనందించకుండా విద్యార్థిదశను వెళ్ళబుచ్చవలసిందేనా?—

ఇది యథాశక్తిగా, యథేచ్ఛగా చదువుకోవలసిందేగాని, ఒకతరగతికి పాఠ్యంగా నియమించి విద్యార్థిచేత పఠింపించవలసింది కాదని చాలామంది అంటారు. కాని, తనపాఠ్యగ్రంథాలను అక్షరాలా అతిక్రమించని నేటివిద్యార్థి ఇవన్నీ ఏం చదువుతాడు? చదివినా, అవి నవలా కులాసాకబుర్లలాగ చదివి, అవతల పారేస్తాడు: అందులో ఇమిడివున్న కళనూ, దాగివున్న సొగసునూ, అంతర్గతమైవున్న భావాలనూ అతను పరికించడు.

పోనీ. ఇతరమాట అటుంచి ప్రస్తుత వాఙ్మయాన్ని గూర్చి కొంచెం మాద్దాం. దీనికి ఒక తరగతి గోడలకు ప్రవేశించే యోగ్యత లేదని కొందరంటారు. యోగ్యతఅంటే ఏమిటి? ఇంతదాక వివరించినట్లు గ్రాంధికానికీ, దీనికీ తేడా అన్నా ఎక్కువలేదు. మరి? దీనిలోమాత్రం కళలేదూ?

> "లయ పెంచుతూ మధ్య
> లయదించుతూ పాట
> రయ మెంచుతూ"

పాడే తెలుగు కోకిల సంగీతాలం వినవస్తుంటే కళలేక పోవటమేమిటి? ఎవరన్నా నవ్వగలరు.

కళ అనేది ఏ భాషలో ఏ మూలాలలో దాగున్నా, అది ఆరాధనాయోగ్యమే. ప్రాచీన వాఙ్మయంలో ఒక రకమైన కళ ఉన్నది. అంతే భేదం. మారే నాగరకతతో, మారే మనుష్యులతో మారింది కళాస్రవంతి మార్గం.

ఈవిధంగా ఆధునికాంధ్ర వాఙ్మయానికి ప్రోత్సాహం ఇస్తే దాని విస్తీర్ణం తక్కిన ఆంధ్ర సాహిత్య విభాగాలలాగ విస్తరమౌతుంది. అభ్యుదయకవి సొంత పుంతలను త్రొక్కి వింత తెన్నే సృష్టిస్తాడు. అనంతమైన అంతరిక్షాల విహరించే విహంగంలాగ కవి స్వీయ నిర్మిత స్వతంత్ర సాహిత్యసామ్రాజ్యంలో స్వేచ్ఛగా తిరుగాడగలుగుతాడు. మానస ప్రాకారాలను దాటి కాని భావాలను వెలువరచటానికి వెరవడు. అప్పుడు భాష ఒక క్రొత్త రూపును పొందుతుంది. దీనివల్ల క్రొత్తపదాలు తెలుగురమ భూషణాలౌతై. తెలుగు భాషవైశాల్యమూ హెచ్చుతుంది. మనదగ్గఱ ఒక రమ్యహర్మ్యాన్ని నిర్మించగల పనితనము వాడున్నాడు. వాడిచేత మనం ఒక మయసభనో, కనీసం ఒక తాజ్‌మహలునో నిర్మింపించాలి.

వ్యావహారికం విశ్వవిద్యాలయాన్ని ప్రవేశిస్తే, మన ప్రాచీనవాఙ్మయానికి దెబ్బతగులుతుందనుకోవడం పొరబాటు. మనిషికి కన్నూ ముక్కూ చెవ్వూ కాలూ కేలూ అన్నీ ఉన్నై. అంతమాత్రాన మనిషి కంగారు పడటంలేదు. ఏ అంగం ఆ అంగం విధిని నెరవేరుస్తుంది కాని, రెండవదాని కార్యాన్ని చెయ్యనూ చెయ్యదు; చెయ్యనూలేదు. అట్లాగే, వాఙ్మయంలో ఎన్ని విభాగాలున్నప్పటికీ ఒక దానివల్ల మఱొకదానికి నష్టం కలదు. గద్యంవల్ల పద్యానికి విలువ తగ్గిందా? పద్యంవల్ల పాటకు? అదీకాకపోయినా, ఈ వ్యావహారిక భాషాగ్రంథపఠనం ఒక స్థాయిని చేరుకున్న విద్యార్థికేకదా నియమించేది! అతనికి ఆపాటికే ఒక ప్రత్యేకమూ ప్రస్ఫుటమూ అయిన గ్రాంథికభాషాశైలి అలవడి ఉంటుంది. అందువల్ల, ఈ వ్యావహారిక భాషా ప్రవేశంవల్ల గ్రాంథికానికిగాని, పురాతన సాహిత్యానికి గాని ఏమీ దెబ్బతగలదు. ఒకవేళ మార్పువచ్చినా, ఆంగ్లభాష ఆంగ్లోపన్యాసాలలోకి చొరబడ్డంవల్ల వచ్చిన నష్టంకంటే, దీనివల్ల ఏమీ ఎక్కువరాదు.

ఈ ఆధునికాంధ్రవాఙ్మయ విభాగంలో రకాని కొకటి మచ్చుగా ఉండాలి. కథాసాహిత్యానికి గుర్తుగా కథల సంపుటిని, భావవాఙ్మయానికి ఒక గేయసంపుటిని, శిష్టవ్యావహారిక చిహ్నంగా ఒక నవలనూ నిర్ణయించి పాఠ్యగ్రంథాలుగా ఉంచాలి. కొన్ని ఆధునాతన వ్యాసాలను — సాహిత్య సంబంధమైనవీ, లౌకికమైనవీ — ఒక పుస్తకంగా కూర్చి నియమింపవచ్చు. ఈ విభాగంయొక్క ముఖ్యోద్దేశమేమిటంటే, తెలుగు పండిత విద్యార్థికి తెలుగు నడలను చూపించి, అభ్యుదయ రచయితల నెఱుక పఱచటమే. తెలుగు నడకలను సమగ్రంగా చూపాలంటే, ప్రాచీన గేయాలూ, ప్రాచీనపదాలూ కూడా ఉండాలి.

దీనివల్ల విద్యార్థికి కలిగే ప్రయోజనం ఏమిటి? పైనచెప్పిన నాలుగురకాల పుస్తకాలూ నామకః పాఠ్యగ్రంథాలుగా ఉంటై అన్నమాటే గాని, విద్యార్థి విమర్శనబుద్ధికి ఆధునాతన వాఙ్మయం ఒక మంచి ఆహారంగా ఏర్పడుతుంది. కుతూహలం ఉన్న విద్యార్థి అభ్యుదయ రచయితల పోకడలను సమగ్రంగా విమర్శించవచ్చు. ఇటువంటి విమర్శనకు అవకాశం పరీక్షల దొంతర్ల నెదుర్కొని ఉత్తీర్ణులయ్యే విద్యార్థి యంత్రాలకు కలగటమేలేదు. పునాదిలో అవకాశాలులేకపోవటంవల్లనే అంతస్తులో కూడా తమ కళాశాలాధ్యాపకులు తయారుచేసిన మరల్లాగ, వల్లెవేసిన నాలుగు ముక్కల్నీ మునిముక్కల్లో ఉంచుకొని పరీక్షకాగితంమీద పీదిరావటం అయిపోతున్నది. నిన్న ప్యాసైనవాడు ఈవేళ విశ్వవిద్యాలయ ప్రధానాధ్యాపకుడు. అయితే భారతంలో ఒక క్రొత్తపద్యాన్ని తీసి అర్థం చెప్పవయ్యా అంటే, మా తెలుగు ముసలవ్వకు ఈడుకాడు. ఒకవేళ మనసులో అర్థం చేసుకున్నప్పటికీ, 'ఇంగ్లీషులో చెప్తాన్సార్' అంటాడు. తెలుగు పద్యాన్ని తెలుగుబిడ్డ తెలుగులో చదివి, ఇంగ్లీషులో అర్థం చెబుతాడట! భేష్! అయినా, అతడు పేర్గన్న ఒకానొక విశ్వవిద్యాలయ పట్టభద్రుడు. అతనేం చేస్తాడు, పాపం. వాళ్ళ 'మేష్టారు' అల్లాగే

ఇంగ్లీషులో చెప్పుంటారు! అదీకాకా, మొన్న మొన్ననే చదువు చాలించాడు, చదివినదీ చదవనిదీ ఒకేతీరుగా కనిపించేసరికి.

ఏది ఎట్లాగున్నప్పటికీ, అవిరళపదమలపరిమళభరితసుమసువాసనలు వ్యర్థం కారాదు. పూరేకుల లాలిత్యమూ, మార్దవమూ, సౌందర్యమూ, సౌశీల్యమూ వీసరపోరాదు. పుష్ప హృదయాంతర్గత మకరందాల మాధుర్యాలు తేటిబృందానికి కాకుండా ఊరికేపోరాదు.

ఇవీకూడా తెలుగున విరచించిన సుమాలమాలలే. ఇవీ తెలుగురమ అలంకారభూషలే. ఆ శోభను తెనుగుబిడ్డ ఆనందించి తీరవలసిందే. అది అతని విధి.

విశ్వవిద్యాలయంవారు ఈ విషయంలో కూడా కొంత శ్రద్ధవహిస్తారని ఆశిద్దాం.

---

'పొలిటిక్స్'లో

# గిరీశం పెట్టిన ఒరవళ్లు

సోమయాజుల సోమేశ్వరరావు

ప్రత్యేకాంధ్రరాష్ట్ర ఆందోళన గురించి, దాని పుట్టుపూర్వోత్తరాల గురించి రాష్ట్రపతి డాక్టరు పట్టాభి సీతారామయ్యగారికి క్షుణ్ణంగా తెలుసు. శ్రీవారు ఏతత్సంబంధమైన ఎన్నో సభల్లో పాల్గొన్నారు. ఇవన్నీ తెలిసివుండీ కూడా "మద్రాసు ఆంధ్రులు శాశ్వతంగా వదులుకోవాలి. అలా అయితేగాని వాళ్లకు రాష్ట్రం సిద్ధించదు' అని శ్రీవారు సెలవివ్వడం!

ఆంధ్రులు అమాయికులు. లేకపోతే వీళ్లు ఒకటి గ్రహించగల్గారా? ఏ కాలంలో అయినా, ఏ రాజకీయవేత్త అయినా, అసత్యాన్ని అందలంలో పెట్టి ఊరేగించకుండా ఉండగలిగాడు కనకనా? శ్రీ కామరాజు నాడార్ యొక్క 191 వోట్ల బలం లేకపోతే డాక్టరు పట్టాభిగారు తాము "రాష్ట్రపతి" పట్టాభిగారై అతి శోభాయమానంగా జయపూర్ నగర మహావీధుల్లో ఎలా ఊరేగ గలిగారు?

ఇవన్నీ పొలిటిక్స్! పొలిటీషియన్ తన పొలిటికల్ మహాస్త్రాన్ని ప్రయోగించి సాధించే అద్భుత కార్యాలు! లోకానుభవం, రాజకీయ విశాల దృష్టి లేని మన అమాయిక ఆంధ్రప్రజానీకానికి వీటి సంగతి కించిత్తయినా తెలియదు. పొలిటిక్స్ అంటే యేమిటో, పొలిటీషియను అనగా యెవడో విపులంగా తెలిసికొని, యిక మీదట రాజకీయాలు కూలంకషంగా అర్థం చేసుకోదలచుకున్న ఆంధ్ర-అన్నలు, ఆంధ్ర-తమ్ములు ఎవరైనా ఉంటే, అట్టి వారిని, మహాకవి గురజాడ అప్పారావుగారి "కన్యాశుల్కం" ద్వితీయాంకంలో గిరీశం, వెంకటేశంగార్లకు జరిగిన యీ క్రింది సంభాషణను చదవమని సలహా యిస్తున్నాను:

గిరీశం: మొత్తానికి మీ ఫాదర్‌తో కత్తు కలిపేశాను.

వెంకటేశం: ఎలాక్కలిపేరేమిటి?

గిరీశం: ఒక పొలిటికల్ మహాస్త్రాన్ని ప్రయోగించి కలిపేశాను.

వెంకటేశం: ఏవిటండా అస్త్రం!

గిరీశం: ఒకడు చెప్పినదల్లా మహా బాగుందనడం! సమ్మోహనాస్త్ర మంటే అదే కదా!

వెంకటేశం: లెక్చరిచ్చి మా నాన్నని వొప్పించడానికి బదులుగా ఆయన చెప్పిందానికి మీరే ఒప్పుకున్నారూ?

గిరీశం: కొంచం నిలువుగా కొలవడానికి వీల్లేనప్పుడు, తిరగేసైనా కొలిస్తే నాలుగ్గింజలు నిలుస్తాయి. బాగా ఆలోచిస్తే యిక్కాడ మారియేజి కూడునసే తోస్తుంది.

వెంకటేశం: ఇన్నాళ్లూ కూడదని చెప్పినారే నాలోటి!

గిరీశం: ఒపీనియన్సు అప్పుడప్పుడు ఛేంజి చేస్తూంటేనేగాని పొలిటీషియన్ కానేరడు.

కుమారప్ప కమిటీ నివేదిక :

# అభ్యుదయ వ్యవసాయానికి అష్టవిధ సూత్రాలు

★ ★ ★

తాడిమళ్ల జగన్నాథరావు.

వ్యవసాయికంగా ఇండియా ఎంత ప్రాముఖ్యం వహిస్తున్నా, ఆహార ధాన్యాలకు, తదితర అత్యవసర వస్తువులకు ఇతర దేశాలమీద ఆధారపడి ఉంటోందంటే ఇండియా వ్యవసాయ విధానంలో గొప్పలోటు ఉందన్నమాట. ఈ లోటును సవరించడానికి తగిన సాధనోపాయాలను సూచించడానికి లోగడ చాలా కమిటీలు వెయ్యబడ్డాయి. వ్యవసాయ సంస్కరణలు ద్విముఖంగా జరుగవలసివుంది. భూమిసాగు పద్ధతి, అమరకపు విధానం ఈ రెండూ తగిన రీతిగా మార్పు చెందాలి. వెనుక నియమింపబడ్డ కమిటీలన్నీ భూమిసాగు పద్ధతులమీదే తమదృష్టిని కేంద్రీకరించి పనిచేశాయి. అధికోత్పత్తికి సాగుపద్ధతులను తగిన రీతిగా మార్చడమే సాధనంగా వారు తలపోశారు. ఇంతలో కాంగ్రెసు ప్రభుత్వాలు తమ తమ రాష్ట్రాల్లో జమీందారీలరద్దు తలపెట్టినవి. జమీందారీల రద్దు అనంతరం జరుగవలసిన కార్యక్రమాన్ని నిర్ణయించడానికి, ఇండియా అంతకు ఒకేవిధమైన వ్యవసాయ సంస్కరణలను సూచించడానికి కాంగ్రెసు అధ్యక్షుడు ఒక సంఘాన్ని సుమారు సంవత్సరం క్రితం నియమించాడు.

శ్రీ కుమారప్ప అధ్యక్షులుగా నియమింపబడ్డ ఈ వ్యవసాయసంస్కరణలసంఘం కేవలం సాగుపద్ధతులపైనేకాక, భూమి అమరకపు విధానాలపైకూడ తన దృష్టిని నిల్పి పనిచేసి ఒక అష్టసూత్ర నివేదిక నొకదాన్ని తయారుచేసింది. జమీందారీల రద్దు తదుపరి సంస్కరణలు కమిటీ నివేదిక దృష్ట్యా జరగాలి. వివిధరాష్ట్రాల జమీందారీ రద్దు యీ చట్టాలు నివేదికకు అనుగుణంగా ఉండాలి.

కమిటీ సూచించే సంస్కరణలలో ముఖ్యమైనది - కమతాలను ఒక నిర్దిష్టమైన పరిమితికి తెచ్చి వీలైనంతవరకు సమష్టి, ప్రభుత్వ వ్యవసాయాలకు వీలు కల్పించడం. ఈ కమతాల పరిమితి ఆయారాష్ట్రాల స్థానిక పరిస్థితులకు అనువుగా నిర్ణయింప బడుతుంది. ఒకని వద్దనుండి కౌలు పుచ్చుకొన్న వ్యక్తి తిరిగి ఇంకొకనికి కౌలు ఇచ్చే పద్ధతి పూర్తిగా నిషేధింప బడుతుంది. దీర్ఘకాలంనుండి సేద్యం చేస్తున్న ఉపకౌలుదార్లకు శాశ్వతమైన జిరాయితీహక్కు ఇవ్వబడుతుంది. పెద్దపెద్ద మొత్తాలను యంత్రాలద్వారా సేద్యం చెయ్యడానికి ఈ కమిటీవారు సుముఖులుగా లేరు. ప్రభుత్వ, సమష్టి సేద్యాల విషయంలో యంత్ర పరికరాలను ఉపయోగించవచ్చును. భూమి సాగుచేసికొనే రైతులకు భూమి సమంగా దొరికేటట్లు చూస్తారు. ఒక్కొక్క వ్యక్తికి తాను సాగుచేసుకో గలిగినంత వరకే భూమి ఇవ్వబడుతుంది. నిజమైన వ్యవసాయదారునకు, భూమిలేని రైతునకు తగినపని కల్పించడం వీరి ఆశయం. భూమిలో సేద్యగానికీ, గ్రామప్రజలకూ హక్కు కల్పించ బడుతుంది. వ్యవసాయాభివృద్ధికి మార్గాలు సూచించడానికి కమిటీలు నియమించ బడతాయి. ఇవేకాక రైతుల ఋణభారాన్ని తగ్గించడం, రైతు కూలీలకు కనిష్ఠ వేతనాలను ఇప్పించడం, ఫలసాయాలకు సరసమైన ధరలు నిర్ణయించడం, కుటీర పరిశ్రమలు నెలకొల్పడం మున్నగు సూచనలుంటాయి.

సాగు విధానానికి లోగడ నియమింపబడ్డ కమిటీలు ఎన్నో రకాల సూచనలు చేశాయి. ఇంతవరకు సాగులోనికి తేబడని భూములను

సాగులోనికి తేవడానికి, కొత్త ప్రాజెక్టులు జలాధారాలు నిర్మించి వ్యవసాయాభివృద్ధి చెయ్యడానికి, వ్యవసాయ పరిశోధనలు చేయించి మంచిరకం విత్తనాలు ఎరువులు నిర్ణయించడానికి సూచనలు చెయ్యబడ్డాయి. ఈ సూచనల విషయంలో మాకు వ్యతిరేకత లేదు. వ్యవసాయానికి ఇండియాలో యంత్ర సామగ్రిని ఉపయోగించాలని ఒక పద్ధతి వారి వాదన. గాంధీజీ ఆర్థిక సూత్రాలను అనుసరించే ఇంకొక పక్షంవారు మటుకు యంత్ర పరికరాల ఉపయోగానికి అంగీకరించుట లేదు. గాంధీజీ సూత్రాలను అవగాహన చేసుకున్న ఈ కమిటీవారు కూడ యంత్రాలు ఉపయోగించడానికి అంత సుముఖులుగా లేరు. ఈ సందర్భంలో ఇటీవల ఐక్యరాజ్య ఆహార వ్యవసాయాల సంఘం డైరెక్టర్ డాడ్ చేసిన సూచనలు కూడ గమనించ తగ్గవి. 'భారతదేశంలో పురాతన కాలంనుండీ అమలులో ఉన్న పద్ధతులను ఒక్కసారిగా మార్చివేసి యంత్రాలు వాడుట మొదలు పెడితే అవి హానికరం కాగలవని, డాడ్ ప్రకటించారు. ప్రభుత్వ, సమష్టి వ్యవసాయాల విషయంలో మటుకు యంత్రాలను ఉపయోగించడానికి కమిటీ సుముఖులుగా ఉన్నారు.

మన ఇండియాలో వివిధ తెగలు, భాషలు ఉన్నట్లే వివిధ పద్ధతుల ఆమరికపు విధానాలు కూడ ఉన్నాయి. ఒక రాష్ట్రంలోని ఆమరికపు విధానానికి మరొక రాష్ట్రంలోని ఆమరికపు విధానానికి చాలా విధాలైన భేదాలున్నాయి. భూమిమీద సంపూర్ణమైన హక్కుభుక్తాలున్న భూస్వామి మొదలు, ఒక్క పొలంపైన మాత్రం హక్కుగల భూస్వామివరకు చాలా రకాల భూస్వాములున్నారు. ఉత్పత్తి పెరగాలంటే రైతునకు తగిన ఉత్సాహం ఉండాలన్న విషయం నిర్వివాదాంశం. ఆవిధమైన ఉత్సాహం రైతున కుండడానికి అతనికి భూమిపై ఏదో విధమైన హక్కు ఉండి తీరాలి. శిస్తు ఫలసాయానికి తగినట్టుగా ఉండాలి, ఫలసాయానికి తగిన ప్రతిఫలం రైతుకు ఉండాలి. ఆయా విషయాలలో కమిటీ సూచించిన సంస్కరణలు సబబుగానే ఉన్నాయని చెప్పాలి. 'దున్నేవాడిదే పొలం' అని ఇప్పట్లో శాసించడం అసాధ్యం. పరిశ్రమలు జాతీయం చెయ్యడం ఎంత అసాధ్యంగా కనపడుతోందో, భూమిని జాతీయం చెయ్యడానికీ కూడ నేటి రోజులలో అన్ని అడ్డంకులూ ఉన్నాయి. అయితే ఇప్పట్లో ప్రభుత్వం చెయ్యకలిగిందల్లా రైతునకు కొన్ని విధాలైన హక్కులూ, సదుపాయాలూ కల్పించడమే.

సొంత కమతాలను ఉంచడానికే నిర్ణయించారు. సొంత కమతాలను ముందు తీసివేసి తిరిగి ప్రవేశ పెట్టిన రష్యా పరిస్థితులు గమనిస్తే, వాటిని తొలగించడం వల్ల లాభం లేదని తేలుతుంది. కమతాల పరిమితి నిర్ణయించడంతో స్వంత వ్యవసాయానికి ప్రోత్సాహం కలుగుతుంది. కౌలుకు ఇవ్వవలసిన అవసరాలు తగ్గుతాయి. ఉపకౌలుదారునకుకూడ భూమిపై శాశ్వతమైన జిరాయితీహక్కు కల్పించడం సబబుగానే ఉంది. కౌలు నియమాలను పాటిస్తున్న రైతును తొలగించరాదనే నియమం కూడ ఏర్పరిస్తే బాగుంటుంది. ఉమ్మడి వ్యవసాయం ప్రోత్సహించడానికి కమిటీ చేసిన సూచనలు చాలా బాగున్నాయి. కూలీల కనిష్ఠ వేతనాలు నిర్ణయించడంతో వ్యవసాయపు కూలీల కష్టాలు చాలావరకు తీరుతాయి. పరిశ్రమల కూలీలను, వ్యవసాయపు కూలీలను సమంగా చూచి, ఇరువురికీ సమాన సదుపాయాలను కలుగచేయవలసివుంది. ఫలసాయాలకు సరసమైన ధరలు నిర్ణయించడమేకాక, ఆ ధరలు రైతులకు సరిగా ముట్టేటట్టు తగిన కట్టుదిట్టాలు చెయ్యవలసివుంది.

వ్యవసాయ సంస్కరణల సంఘ నివేదికను ఆచరణలోకి వెంటనే తేవలసివుంది. భూస్వాములకు రైతులకు గల సంబంధాలు నానాటికీ చెడుగా పరిణమిస్తున్నాయి. ప్రభుత్వం ఉత్త వాగ్దానాలు చేస్తున్న కొద్దీ ఈ సంబంధాలు మరీ చెడిపోతున్నాయి. ఈ కమిటీ ప్రస్తుత దేశావసరాలను బాగా గమనించి తన నివేదిక తయారు చేసింది. ఇది వెంటనే అమలు జరిగితే రైతునకు తగిన ధైర్యం, ఉత్సాహం కలిగి ఉత్పత్తి అధికం అగుటకు మార్గాలేర్పడతాయి.

# మార్క్సిజం వైజ్ఞానిక వాదమా?

ప్రకృతి, వికృతి, సంస్కృతి. సంభావనాత్మకమయిన మార్క్స్ త్రిక సిద్ధాంతం విషయంలో మార్క్సిస్టులే రెండు పక్షాలుగా చీలిపోయి వున్నారు. కొందరు- అది మార్క్సిజాన్నీ, విశ్వసంఘటనలను అర్థంచేసుకుంటానికి సహకరించే మహోత్కృష్ట సిద్ధాంతమనీ, అది లేనిదీ మార్క్సిజమే లేదనీ విశ్వసిస్తారు. ఇతరులు- అది మార్క్స్ చిన్ననాడు తన్ను ఆకర్షించిన హెగెల్ సిద్ధాంతంమీద పెట్టుకున్న వెర్రిభ్రమ అని తృణీకరించి వేస్తారు. ఈ ఉభయుల్లో ఎవరి అభిప్రాయం సరియయిందో తేల్చుకోడానికి మార్క్స్ సిద్ధాంతాన్ని తరచి పరిశీలించడమే ఏకైక మార్గం.

క్లుప్తంగా చెప్పాలంటే, త్రికసిద్ధాంతం సారాంశం యిది: వాస్తవికతను బట్టి మన అభిప్రాయాలేర్పడ్డవి గాని, అభిప్రాయాలను బట్టి వాస్తవికత యేర్పడలేదు ఆ వాస్తవికత పరస్పర సంబంధంలేని విభిన్న వస్తువులు గాక, పరస్పరం ఆధారపడి ఉన్న అనేక వస్తుసముదాయపు స్వరూపం. అది స్తబ్ధంగానో లేక నిత్య సంచలిత స్థితిలోనో ఉంటూ, ఉద్భవిస్తూ, వృద్ధి పొందుతూ, నశిస్తూ యీ విధంగా పరిభ్రమిస్తూ ఉంటుంది. ఇందులో ప్రవృద్ధి ఒక స్థితివరకూ క్రమక్రమమై, హఠాత్తుగాఆగి కలవరంపొంది, ఆ కలవరానికి అంతంలో ఒక నూతన స్థితికి దారితీస్తుంది.



ప్రవృద్ధికీ, ఉత్పత్తికీ,నాశనానికీ కారణం- వస్తుగర్భంలోనే యిమిడివున్న వైరుధ్యం. ప్రవృద్ధి అంతంలోకలిగే అంతరాయం, కలవరం నశించేదాని అపజయానికీ,నూతనంగా ఉద్భవించే దాని విజయానికీ కారణాలు

ఇవి కేవలం మార్క్స్ ఊహావైపరీత్యాలా? లేక వీనికి వైజ్ఞానికమయిన ఆధారం ఏమయినా ఉందా? వైజ్ఞానికాధారంతోపాటు ఇవి మన ఆధ్యాత్మిక సంభావనలకు అనుకూలమా,విరుద్ధమా? అనే విషయాలు విపులంగా చర్చించడం చాలా అవసరం.

## మార్క్సిజం: ప్రకృతిశాస్త్రం

ప్రకృతి శాస్త్రంలో ముఖ్యమైన సూత్రాల్లో న్యూటన్ పండితుడి సూత్రాలూ, శక్తి అనశ్వరత్వమూ చాలా ముఖ్యము లైనవి. అవి దృశ్యములయిన ప్రకృతి సంఘటనలను పరిశీలించగా ఏర్పడిన నిర్ణయములు.

న్యూటన్ మొదటి సూత్రం: విశ్వంలో ప్రతివస్తువూ ప్రతి యితర వస్తువునూ ఆకర్షిస్తుంది.ఆ ఆకర్షణ శక్తి ఆ వస్తువుల భారాన్ని ఒకదాన్ని మరొకదానిచేత హెచ్చించగా వచ్చిన మొత్తం అధికమైనకొద్దీ అధికమవుతుంది. ఆ వస్తువుల మధ్యదూరం అధికమయినకొద్దీ తగ్గిపోతుంది. ఆకాశంలోనక్షత్రాలూ, భూమి వంటి గోళాలూ యివన్నీ యీ ఆకర్షణ శక్తివల్లనేనిలబడివున్నవి ఇవినిరంతరం చలిస్తున్నా, యిందువల్లనే గతి,క్రమమూతప్పకుండావున్నవి.

రెండవ సూత్రం: విశ్వంలో ప్రతి వస్తువూ స్తబ్ధంగానైనా ఉంటుంది, లేదా నిడుపు రేఖలలో సమవేగంతో చలిస్తూనైనా ఉంటుంది. బాహిరమైన శక్తి యేదో యీస్థితిని మారిస్తే తప్ప, యీ ధర్మాలు వస్తువుల స్థితిని పాలిస్తవి.

మూడవ సూత్రం: కర్మ ప్రతికర్మ సమానమూ, పరస్పరవిరుద్ధమూ; శక్తి సృష్టించడానికీ,నాశనంచేయడానికీవీలు లేనిది. స్తబ్ధస్థితినుండి చలనస్థితికీ, ఒక రూపంనుండి మరొక రూపానికీ మార్పు చెందుతుందే గాని పరిమాణంలో శక్తికి మార్పు లేదు.

ఈ సూత్రాలకు విరుద్ధంగా ప్రకృతిలో ఏసంఘటనా సాధ్యం కాదు.

విశ్వంలో సంభవించే వికృతులు భౌతికములూ, రసాయనికములు అని రెండు విధములు. వీటికి అతీతమయిన శాస్త్రీయ వికృతి మూడోది.

న్యూటన్ మొదటి సూత్రం ప్రత్యక్షంగా మార్క్సిజానికి సంబంధించింది కాదు. వస్తువుస్థానంలో అనుకూలతనూ, విశ్వతనూ ఊహించితే, మానవ స్వభావం, మానవులూ యీధర్మాన్ని అనుసరిస్తా రనుకోవచ్చు.

ఇక న్యూటన్ రెండవ సిద్ధాంతం చాలా ముఖ్యమయింది. ప్రకృతిలో ప్రతివస్తువూ స్తిమితంగా ఒకచోట వుండడమో, ఒకే వేగంతో ఒకే దిశలో చలించడమో చెయ్యాలి. అలా కాకపోతే ఏదో బాహిరమయిన శక్తి దానిమీద పనిచేసిం దన్నమాట.

ప్రకృతిలో వస్తువులు ఏవీ స్తిమితము గానూ లేవు, ఒకేదిశలో ఒకేవేగంతో చలించడమూ లేదు. సూక్ష్మంగా పరిశీలిస్తే ఏదీ నిశ్చలంగా లేదు. ప్రతీదీ చలిస్తూనే వుంది ఆఖరికి నిశ్చలంగా కనపడే పర్వతాలుకూడా ఒకవిధంగా చలిస్తూనే వున్నవి. ఈ చలనం ఒకేదిశలో ఒకే వేగంతో జరగడంలేదు ఆఖరికి గ్రహాలు కూడా యీధర్మాన్ని అనుసరించడం లేదు. వాటికీ అతిచారవక్రగతు లున్నవి. అంటే ఏమిటి? బాహిరమయిన శక్తి యేదో వీటిమీద పనిచేస్తూ వుండాలి. ఆదిలో స్తిమితంగానో, ఏకదిశలో ఏక వేగంతో సంచరించుతూనో వుండే వస్తువులను తద్వ్యతిరిక్తంగాప్రవర్తించే టట్లు వస్తువులకు యితరమైన శక్తిఏదో పని చేసి వుండాలి పరిమాణంలో, స్వభావంలో భిన్నములయిన వస్తువుల్లో మొదటి చలనం ఏదోశక్తి, విద్యుచ్ఛక్తితో నడపబడే ఫ్యాక్టరీలో స్విచ్ నొక్కినట్లుగా, కలిగిస్తే తక్కిన చలనాలన్నీ యీ సూత్రాల ననుసరించి నడుచుకుంటవి. న్యూటన్ పండితుడి సూత్రాలు నిజమయితే, వస్తుకోటి సమదూరములూ, సమభారములూ కావడానికి వీలులేదు. వీటిలో విభేదం చాలా అవసరం. మార్క్సు ప్రకృతి, వికృతి, సంస్కృతులీ ఆదిశక్తిస్వరూపం నిర్ణయించడంలేదు. ఏదోశక్తి ఆదివస్తువులో ఆదివికృతిని కలిగిస్తే, న్యూటన్ మూడవ సూత్రం అనుసరించి చలన క్రమం సాగిపోతూ వుండవచ్చును.

ఇక-శక్తి అనశ్వర సిద్ధాంతం: ఏ మార్పు యెక్కడ జరిగినా, శక్తి స్వరూపంలో మార్పు చెందవలసిందేగాని, పరిమాణంలో మార్పుచెందగూడ దంటుంది. ఈ ధర్మం మానవ సంఘంలో మార్పులకు అన్వయిస్తే, పూర్వస్థితి

కొంతశక్తిని కోలుపోతే గాని, అంత కన్నా నూతనమైన ఉత్తమస్థితి రావడానికి వీలులేదు. అందుచేత ఉత్తమమయిన నూతనస్థితి వచ్చినప్పుడు పూర్వస్థితి నశించక తప్పదు. అందుచేత దీనికీ మార్క్సు సిద్ధాంతానికీ అంతగా వైరుధ్యం లేదు.

ఇక మార్క్సు సంభావించే వికృతి భౌతికవికృతివంటిదా? రసాయనికవికృతి వంటిదా? జీవశాస్త్రీయ మయిన వికృతి వంటిదా? నీరు వేడిచేస్తే, కొంత సేపు నీరుగానేవుంటుంది కాని అట్లాగే వేడిచేసుకుంటూ పోతే, ఉడకడం ఆరంభించి ఆవిరి అయి పరిమాణంలోనూ, స్వభావంలోనూ, స్థితిలోనూ మార్పు చెందుతుంది. అలాగేచలవచేసుకుంటూ పోతే మంచై ఈధర్మాలనే అనుసరిస్తుంది అయితే యిది కేవలం భౌతికమయిన వికృతి. స్థితిమారినా, పరిమాణం మారినా యిందులో నీటి రసాయనిక స్వభావం మారలేదు. వేడి, చలవ విరుద్ధ పరిస్థితులలో ఉపయోగించి ఆవిరి నుంచి నీటినీ, మంచునుంచి నీటినీ తయారు చేయవచ్చును. మార్క్సిజాన్ని బలపరిచేవారీ ఉపమానం తరుచు తెస్తారు. ఇందులో నీటిని వేడిచేయడమయినా, చలవ చేయడమయినా నీటికి బాహిరమయిన శక్తి ప్రయోగం మానవ సంఘం నీరనుకుంటే యీమార్పు తెచ్చే బాహిరమయిన శక్తియేది? ఉత్పత్తి విధానములలో మార్పా? అప్పుడు వాటిని మార్చిన శక్తియేది? మానవుడి బుద్ధి. ఆ బుద్ధిని ఏశక్తి మారుస్తున్నది? ఆశక్తే విరుద్ధపరిస్థితుల్లో ఉపయోగించినప్పుడు, నీటిస్థితిలాగే, సంఘంస్థితీ కేపిటలిజంనుంచి సోషలిజానికీ, సోషలిజంనుంచి ఫ్యూడలిజానికీ మారుతుందా? మార్క్సు సిద్ధాంతం, పూర్వస్థితి మారినప్పుడు అంతకన్నా ఉత్తమస్థితి వస్తుంది గాని అదేస్థితి రాదంటుంది. అందుచేత యీఉపమానం అంతమంచిది కాదు.

ఇక యీ వికృతి రసాయనికమైన వికృతివంటిదా? ఒక లోహమును వేడిచేస్తేఅది ప్రకృతిలో ప్రాణవాయువుతో చేరి ఆక్సైడై, ఉత్తమస్థితి పొందుతుంది .అలాగే ఉత్తమస్థితిలో ఉన్న దాన్ని వేడిచేస్తే అది ప్రాణవాయువును పోగొట్టుకు రసాయనికంగా అధమస్థితికి వస్తుంది. అలాగే రసాయనిక ఆకర్షణ విరుద్ధంగా వున్న రెండింటిని వేడిచేస్తే రెండు విరుద్ధస్వభావంగల వస్తువులు వస్తవి. ఒకటి పోగొట్టుకున్న దాన్ని మరొకటి తీసుకోడమో, రెండూ కొంత పోగొట్టుకుని మూడు వస్తువులు కావడమో జరుగుతుంది. ఇందులో పూర్వస్థితికన్న ఉత్తమస్థితి అంటూలేదు రసాయనిక స్వభావంలో మార్పు మాత్రం జరిగింది అంతే అందుచేత పూర్వస్థితిని మించిన స్థితి కలిగిస్తుందని మార్క్సు ఊహించిన వికృతి రసాయనిక వికృతి అంటానికి వీలులేదు.

ఇవి రెండూ కాకపోతే అది జీవశాస్త్రీయమయిన వికృతి కావాలి. ప్రపంచంలో ప్రతీదీ నిరంతరం మారుతున్నది అనేక వస్తువుల సముదాయమే జీవికి పరిసరములు. అందుచేత పరిసరములలో నిత్యమూ మార్పు వస్తున్నప్పుడు జీవి తదనుగుణంగా మారుతుంది. ఆ పరిసరములను బట్టి మారే ప్రయత్నంలో, పూర్వ స్థితి మారి, అంతకన్నా ఉత్తమస్థితిని పొందుతుంది.

ఉత్తమస్థితిని పొందిన జంతువులు తమ శక్తితో, తెలివితేటలతో అధమస్థితిలో ఉన్న జంతువులను లోబరుచుకోడమూ, ఆహారంగా వినియోగించుకోవడమూ, మానవుడు జంతువుల్ని లాగా తమకోసం వినియోగించుకోడమూ జరుగుతుంది. ఈమార్పులో జీవితావసరములు మార్పుచెంది, సమగ్రంగా లభించక, ఉనికి కోసం సంఘర్షణ ఏర్పడి అందులో ఉత్తములధముల్ని అణగద్రొక్కడమో, సంహరించడమో జరుగుతుంది. అయితే కోతికన్న ఉత్తమస్థితి పొందిన మానవుడు తిరిగి కోతికావడం సృష్టి వెనక్కి నడిస్తేగాని సాధ్యమయిన పని కాదు. మానవుడు మారి అధిమానవుడు రావడానికి అవకాశం ఉందని జీవశాస్త్రం బోధిస్తుంది అందుచేత మార్క్సు ఊహించిన వికృతి జీవశాస్త్రీయమయింది కావచ్చును. అలా అనుకుంటే, పరిసరములలో మార్పూ, అందువల్ల జీవి శరీరంలో మార్పూ, పూర్వస్థితికన్న ఉత్తమస్థితీ జీవశాస్త్రీయంగా ఊహించుకోవచ్చును. ఉత్తములు అధముల్ని లొంగదీయడం, స్వార్థానికి సంహరించడం మార్క్సిజం సమర్థించదు. పైగా ఆ జీవశాస్త్రసూత్రం మార్క్సిజానికి వ్యతిరేకం కూడ. అందుచేత మార్క్సిజం వైజ్ఞానికం (సైంటిఫిక్) అనేవారు దూరం ఆలోచించినట్లు కనిపించదు. మార్పుకూ ప్రగతికీ, అభివృద్ధికీ ప్రకృతి, వికృతి, సంస్కృతులేకాక వేరే శక్తినికూడా ఊహించుకోక తప్పదు. ఆ శక్తిని ఊహించనినాడు మార్క్సు సిద్ధాంతం సందేహాలకు దారితీస్తుంది. ఈ బాధపడలేకనే కొందరు మార్క్సుఅనుయాయులు ఆయన త్రికసిద్ధాంతాన్ని వ్యక్తిగతమయిన వెర్రిగా తోసిపారేశారు.

మార్క్సిజం: ఆధ్యాత్మ

ఇక విజ్ఞాన ప్రపంచాన్ని వదలి ఆధ్యాత్మికంగా మార్క్సుసిద్ధాంతాన్ని పరిశీలిద్దాం.

సృష్టికి పూర్వం అనంతమూ, నిర్గుణమూ అయిన వస్తువులో బ్రహ్మం, భగవంతుడు న్యూటన్ రెండవ సిద్ధాంతంలో బాహ్యమయిన శక్తి, ఆదిచలనాన్ని కలిగించగా సృష్టిక్రమం ఆరంభమయింది జీవకోటిలో ప్రకృతి, వికృతి, సంస్కృతులవల్ల మానవుడు తయారయాడు ఉనికికోసం సంఘర్షణ, ఉత్తమం అధమాన్ని నాశనం చేయడంలో మానవులు మానవుల్నే నాశనం చేయడంతో వారిలో మనస్సు, దాంతో ఉత్తమ సంస్కారములూ వచ్చేవి దాంతో బాటు మనస్సు, వాక్కు, దేహక్రియలతో, మూడువిధములయిన కర్మలు సాగించారు ప్రతి కర్మా ప్రతికర్మను కల్పించి విశ్వజీవకోటిని అనంతమైన చలనస్థితిలో ఉంచుతోంది.

బుద్ధి ఏర్పడినా, దాన్ని అణచించే పశుగుణమూ, దాన్ని దుర్వినియోగం చేసే వికృతి స్వభావమూ మానవుడి కర్మలో వ్యత్యాసాన్ని కల్పించినవి. అందుచే మానవసంఘపరిణామానికి కర్మ కారణం. కర్మకు ఆదిహేతువయిన బ్రహ్మశక్తి ప్రధానం. ఒక ఆదిశక్తిని ఊహిస్తే, మార్క్సు త్రికసిద్ధాంతం హిందువుల కర్మసిద్ధాంతంతో ఐక్యం పొందుతుంది.

# పారిపోయిన కుక్క



అంగర వెంకటకృష్ణారావు

సముద్రంలో కనుచూపుమేర కెరటాల సూర్యోదయపు కోమలారుణ రోచిస్సులని జల్లిసి చరమాచలంపైకి నిర్గమిస్తున్నాయి చీకట్లు. ప్రభాతసమీరాలు తాజాగా వీస్తున్నాయి.

ఇసుకనేల విడిచి రోడ్డెక్కి కొద్దిగజాలు నడిచానో లేదో ఆదృశ్యం కంటపడింది.

పిలకలు పీకిన జుట్టు, పెరిగిన గడ్డం, లోతైన బుగ్గలు, పిండి జల్లినట్టున్న కళ్లు, జీర్ణవస్త్రాలు, ఒకకాలు సొట్ట-చంకలక్రింద ఊతకర్రలు - అస్థిపంజరం!

ఎడమచేతిలో ఒక చిప్ప-ఆ చేత్తోనే పెనచి పట్టుకొన్నాడు కుక్కకు కట్టిన త్రాడు.

దగ్గరగా వెళ్ళాను, అదేమిటో వింతగా తోచి.

కుక్క పెనుగులాడుతూంది. అతడు గుండ్రీ గిలబడుతూ కంట నీరుపెట్టుకుని, కుడిచేత్తో చూపిస్తున్నట్టు సంజ్ఞలు చేస్తూ బ్రతిమాలుతున్నాడు. అతడు బ్రతిమాలినప్పుడల్లా ఆ కుక్క మరీ గింజుకుని, త్రాడు తెగితే పారిపోవడానికి తీవ్రయత్నం సాగిస్తూంది. అతడు చెమటలు కక్కుతున్నాడు.

నేను మరీ దగ్గరగా వెళ్ళాను.

'నన్ను విడిచిపెట్టకే! నామాట విను-నువ్వు లేకపోతే నే నుండలేను!'

నాకు జాలి వేసింది.

'ఒక్క నిమిషమున్నా వుండను' తెగ గింజుకుంది-వణికిపోయాడు వాడు.

హడలిపోయాను నేను! మాట్లాడింది-కుక్క!! ఆ ముష్టివాడి గజ్జికుక్క!

వాడితో అన్నాను-'ఏమిటోయ్! ఈ కుక్క నిన్నువిడిచి ఎందుకు వెళ్ళిపోతా నంటుంది' అని. వాడు జవాబు చెప్పబోయ్యేలోగా కుక్క నా వేపు చురచుర చూసి, 'నీకెందుకు మా గోల- పో, అవతలకి' అని అరిచింది. నాకు సిగ్గు వెయ్యలేదు. ఆ కుక్క యజమానిని చూడగానే నా హృదయంలో మానవ సహజమయిన జాలి నిండి తొణికిసలాడింది; మరి యేం యితర సానుభూతికి చోటు లేకపోయింది.

జారిపోతూన్న ధైర్యాన్ని కూడగట్టుకుని కుక్కని అడిగాను, 'దయచేసి చెప్పమ్మా, యీతడి నెందుకు విడిచి వెడుతున్నావో' అని.

'నువ్వు వేసిన ప్రశ్నకు అంత సంక్షిప్తంగా జవాబు చెప్పడం కష్టం—కాని చెబుతా!'

అప్పుడు ముష్టివాడి కళ్ళంట జడివాన కురుస్తోంది.

'మానవప్రకృతిసిద్ధ చాకిరి చేసినందువల్ల ప్రయోజనం లేదని నిన్నరాత్రి మాకాస్తగా గ్రహించాను'.

'విశ్వాసానికి పేరుపడ్డ జాతికదా నీది-ఇప్పుడింత అవిశ్వాసంగా ఎందుకు ప్రవర్తించబోతున్నావ్?'

'చెప్తున్నా - తొందరపడకు' కుక్క కూచుంది.

'మేం తరతరాలుగా వీళ్ళ కుటుంబానికి సేవ చేస్తూన్నాం. మా అమ్మ నేటికి ఏడాది క్రిందటి వరకూ యితని తండ్రికి సకల సపర్యలూ చేస్తూండేది.'

ముష్టివాడు కళ్లు తుడుచుకుంటూ అన్నాడు- 'పిల్లమ్మ మానాన్నకి పదియేళ్లకు పైగా సేవ చేసింది. ఇద్దరూ నిరుడు ఏకకాలమందే చచ్చిపోయారు'.

మాట నొక్కితే స్ప్రింగు తన్నినట్టు కుక్క లేచి గుడ్లు పెద్దవిచేసి నావేపు వురిమింది.

మానవసామాజికుడిని శునకసామాజికురాలు ఎదిరిస్తూంది.

'నువ్వలా తొందరపడకు- మామీద కోపపడి కుంటివాడైన నీ యజమానిని ఎందుకు విడిచి పెడతావు, పాపం.'

'ఎందుకా! చేసిన సేవకి ఫలితం వుండాలి. చేసినవాళ్లకికాదు- కసిరం చేయించుకున్న వాళ్లకి. తరతరాలుగావీళ్ళనికని పెట్టుకొనివుండి వీళ్ళచరిత్ర కనిపెడుతూన్నా—వీళ్ల పితామహ ప్రపితామహుల దగ్గరనుంచీ ముష్టివాళ్లే- వీళ్ల చిరనివాసమయిన అంబటిసత్రవుని వర్ణించడానికి, చివరకి ఎన్ని అబద్ధాలైనా వ్రాయడానికి జంకని ఏ కవీ కూడా పూనుకోలేదు— నిశ్వాసాలు, బరువైన ఉచ్ఛ్వాసాలు, యాతనాజనితహృదయ విదారకాక్రందనాలు, శీర్ణదేహాలు, నిత్యాంధకార భవితవ్య జీవనాలు మొదలైనవాటితో ప్రత్యక్ష నరకంగా వున్న వీళ్ల అజ్ఞాతనివాసాన్ని బాగుచెయ్యడానికి ఏమానవుడు తలపెడతాడు!'

'కుక్కా, నువ్వు చాలా తొందరపడిపోతున్నావు! మానవుడిప్పుడే సంస్కార కార్యంలోకి దిగేడు- అతడికి కొంత వ్యవధి కావాలి!'

'వ్యవధి కావాలా! దబాయించకు. ఈవూళ్లో ఒక ఈశ్వరాలయం వుంది. దాన్ని తొమ్మిది వందల ఏళ్లక్రిందట మరాటీదండు వచ్చి శిథిలపరిచింది. దాని పునరుద్ధారణకి నేడు రెండు లక్షలు ఖర్చుపెడతారట! దానికింత తొందరేం?'

'మనదేశం కళలకు నిలయం. ఆ దేవాలయంలో గొప్ప శిల్పం వుండేది. దాని శైథిల్యాలే నేడు పునరుజ్జీవింపచెయ్యబడుతున్నాయి.'

కుక్క అపహాస్యంగా నవ్వింది- 'ఓయి వెర్రివాడా! తొమ్మిదివందలేళ్లక్రిందట విరిగిన రాతిబొమ్మ లతకడానికి యిప్పుడే యింత తొందర, అవసరం కలిగాయి! చూడు, నా యజమానివైపు. ఈగడ్డలో కర్మపదానికి తొలివ్యాఖ్య వ్రాయబడిననాటినుంచి నేటివరకూయితడు శిథిలంగానే వున్నాడు- ఇతడి వునికి అయిన అంబటి సత్రవు నిత్యశిథిలావస్థ అనుభవిస్తూంది. ఆ దేవాలయంలో నిర్జీవ ప్రాణాలున్నాయి. ఈ దుఃఖాలయంలో కవోష్ణరుధిరం స్రవిస్తూన్న హృదయాలున్నాయ్! ఈ విషయం గ్రహించలేకపోవడానికి కారణం నీలో హృదయం లేకపోవడమే!'

నే నేమంటాను? శ్రుతి మించిపోయింది. కాని కలిస్తే కలిచింది - ఇంతకీ పిచ్చికుక్క కాదని తిరిగి ధైర్యం తెచ్చుకున్నాను.

'ఢిల్లీలో ఒక్క భిక్షువు లేడు తెలుసా!' బోర విరుచుకు నవ్వాను.

'కానట. ఉండలేక పారిపోయి వుంటారు. పక్షుల్లా ఎగిరేవాళ్ళకోసం కేటాయించబడ్డ నగరంలో గాలికి ధూళికి పెరిగేవాళ్లెలా మనగలుగుతారు' అని ఒక్కసారి గుంజాకుంది పారిపోవాలని. ముష్టివాడు కదిలిపోయాడు- సొట్ట కాలుతో సొట్ట కాకిలా గెంతాడు.

'ఉండుండు! నా ఆఖరు వుపదేశం విను'— కుక్క నిల్చింది.

'ఈ వూళ్లో చాలా ధనవంతు లున్నారు— ఉదారసమాజా లున్నాయి, వాళ్లెవరికైనా ఎప్పటికైనా బుద్ధి పుడుతుంది. వీళ్ళంతా నరక ముక్తి పొందుతారు. తొందరపడి యీ నిస్సహాయ విహానజీవిని పరిత్యజించకు'-నా హృదయం రోదించింది.

'పిచ్చివాడా! మా అమ్మ చెప్పేది: పదిహేనేళ్లక్రితం ఈ వూళ్లో పదిహేను మేడలు మాత్రం వుండేవి. ఊరు పొడుగు సుమారు రెండు మైలు-వెడల్పు లేదనే చెప్పాలి. ఏమంటే ఒకవైపు సముద్రం, ఒకవైపు కొండ. ఇప్పుడో! సుమారు రెండులక్షల ప్రజ లున్నారు. పూర్వం దయ్యాలు తాండవించే ప్రదేశాలలోకూడా సినిమా భవనాలు, మేడలు, మోటారుకారులు! ఆ రోజుల్లో యీ వూరంతటికీ 'పొట్ట' గలవాడు మిఠాయి అమ్మే బొంబిల్ బాబా ఒక్కడేనట. కాని అతడి కాపొట్ట ప్రకృతిప్రసాదితం. నేడో! 'పేదల రక్తమాంసముల పెంపువహించిన' గూనల్లాంటి. బానల్లాంటి పొట్టలు ఎన్నివేలో తిరుగుతున్నాయి. కాని అప్పటికీ, యిప్పటికీ మారనిది అంబటి సత్రవు. మరీ శిథిలమైపోయినవాడు నాయజమాని-అందుకే నేనుండను' అని మళ్లీ గుంజాయించింది.

'అయ్యయ్యో-ఇన్ని తెలిసినదానివి నువ్వు యింత తొందరపడితే ఎలా......'

'తొందర కాదు-మానవులతో కూడుకొన్న యీ అనాగరక విపినజీవితం ముగించి-జంతువులతో కూడిన నాగరక ప్రపంచంలోకి వెళ్ళిపోతున్నాను. అది ఆ కనుపించే కొండ కవతల వుంది. అప్పుడప్పుడు కొండెక్కి చూస్తుంటాలే. నరభుక్కుల పొట్టలు- మానవమృత్యుల కంటె పొరలు పోయాక తిరిగివస్తా అంబటి సత్రవులోకి, కాదు-అధికారంలోకి.' దక్కపటక్కున కాదు కొరికి అదే పరుగు. ముష్టివాడు వెల్లకిలా పడ్డాడు.



# చెల్లుపెట్టిన బాకీ

"హితశ్రీ"



బాకీ దమ్మిడీమిగిలినా తనయింట్లో ప్రవేశించడానికి కోడలికిఅర్హత లేదనిఅత్తగారు అన్నది. ఎలా-? ఆరాత్రంతా జానకి ఆలోచించింది....

* * *

కట్నందబ్బు చెల్లించుకోలేని కారణాన తన జీవితసౌఖ్యాన్ని ఎవరి ఇంట్లో అనుభవించవలసివుందో వారిచేత తిరస్కరింపబడి గోదావరీ నదికి తన మిగిలిన జీవితాన్ని అర్పించిన ఓ అదృష్టహీన విషాదాంతగాథ తెరపై చూసిన జానకి నేత్రాలు మర్నాడు ఎర్రబడడం సహజమే.

గతరాత్రి మానసోల్లాసంకోసం సినీమాకి వెళ్ళిన జానకి మనోవేదనతో తిరిగి వచ్చింది. చిత్రం కేవలం తన గత జీవితానికి ప్రతిబింబంలా ఉంది. ఆ రాత్రంతా జానకి ఆలోచించింది— చిత్రంలో పరాభూత అయిన మానవతి చేసిన ఆత్మార్పణ ఆమెను మాటిమాటికీ వేధించసాగింది. మరణించి సాధించగల ప్రయోజనం ఏమిటి? జాలిగుండె కలవారు సానుభూతి పూర్వకంగా నాలుగు అశ్రుకణాలు రాల్చవచ్చు. బడబానలంలా ఆ అశ్రుకణాలనుంచి అగ్నికణాలు ఆవిర్భవించి ఈ దురాచారాన్ని దహించగల అవకాశం లేకపోలేదు. కాని ఫలితం అందుకోటానికి తను లేకపోయిన తర్వాత ఏం జరిగితే ఏం ప్రయోజనం తనకి? విరక్తితో జీవిత విరమించడం కేవలం చేతకానితనం ఒప్పుకోవడమే. ఎవరిమీదో గల కోపమూ, కసీ తనమీదే చూపించుకొన్నందువల్ల కలిగేలాభం ఏముంది? తన దుఃఖానికి కారకులైనవారి మనసులు మార్చడం సాధ్యంకానిపక్షంలో వారికి తగిన పాఠం నేర్పడానికి ప్రయత్నించడం తన కర్తవ్యం. ఇందుకు, తన భవిష్యత్తును తమ పిడికిళ్ళలో బంధించిన త్రిమూర్తులతో ఒకసారి ముఖాముఖి మాట్లాడడం ఎంతైనా అవసరం. కాని-కట్నంబాపతు

అనుకోకుండా బండి దిగిన కోడలినీ, ఆమె చిన్న తమ్ముణ్ణీ చూసి ఆశ్చర్యపోయారు, జానకి అత్తవారు. ప్రశ్నార్థకాల్లా ఉన్న వాళ్ళ చూపులకి సమాధానం ఇచ్చింది జానకి—

'నాన్నగారు ముఖ్యమైన పని ఉండి రాలేక పోయారు. ఈరోజు తప్పితే మళ్ళీ నెలదాకా మంచిరోజు లేదట—' మధ్యలోనే ఆపివేసింది జానకి. ఈ మాటలకేమి. అసలు విషయం సంగతి ఏమిటన్నట్టు చూసింది జానకి అత్తగారు.

'అంతడబ్బు దగ్గర ఉండడం మంచిది కాదని నాన్నగారు చెక్కు ఇచ్చారు.' తమ్ముడి దగ్గర నుంచి పర్సుతీసికొని చెక్కు మామగారికి అందించింది జానకి.

నాలుగు వేలు! పోయిందనుకున్న విలువైన వస్తువు దొరికిన వాడిలా ఆనందం పట్టలేక చిన్న కేకవేశాడు జానకి మామగారు. అత్తగారికి చాటంత ముఖం అయింది. లక్ష్మి, లక్ష్మిలాంటి కోడల్ని సంపాదించింది కదామరి! ఒక్కసారిగా ఆమెకు కోడలిమీద ఎక్కడలేని ప్రేమా, అభిమానమూ పుట్టుకొచ్చినయ్. కూతురుతో అంది:

'కమలా, మీ వదినెకి కాళ్లు కడుక్కోటానికి నీళ్లియ్యి—ఎప్పుడు నేర్చుకొంటావే, ప్రతీదీ చెప్పాలా?'

హడావిడిలో జానకి దరహాసం ఎవరూ గమనించలేదు.

ఆరాత్రి—

'ఇన్నాళ్ళకి నేను జ్ఞాపకం వచ్చానా-జానకీ?' అన్నాడు శ్రీధరరావు. తను మాట్లాడేది అర్థరహితం అని తెలిసి ఉండీ కూడా. జానకి మాట్లాడలేదు.

'ఇప్పటికైనా మనమీద దేవుడికి దయకలిగింది' అన్నాడు శ్రీధరరావు మళ్లీ జానకీముఖం వంక చూస్తూ.

'పగ్గాలు మనచేతుల్లో పట్టుకుని బండి నడపడంలేదని ఎవర్నో దూషిస్తే ఏం లాభం!' కటువుగావచ్చిన ఈ సమాధానానికి శ్రీధరరావు కనుబొమ తెగరవేసి జానకీవంక చూశాడు.

'అయిపోయిం దేదో అయిపోయింది కదా! నిజంగా ఇవ్వాళ ఎంత మంచిరోజు—'

'అవును. నాలుగువేలు వచ్చాయి కదూ.'

'అదికాదు, జానకీ...'

'మనసులో ఒకటీ, పైకి ఒకటీ ఎందుకు? నేనే మీకు కావలసి ఉంటే—'

'నువ్వు నన్ను సరిగా అర్థం చేసుకోలేదు జానకీ.'

'నిజం. అందుకే నేనీరోజు ఈ యింట అడుగుపెట్టటం సంభవించింది.'

'నీకు నామీద చాలా కోపంగా ఉంది. జరిగినదానికి నన్ను క్షమించలేవా?' శ్రీధరరావు జానకి చుబుకం ఎత్తి వేడికోలుగా అన్నాడు. జానకి అతనిచేతిని త్రోసివేసి అంది—

'జానకి కోపంతో మీకు నిమిత్తం ఏమిటి? మీకు కావలసింది డబ్బేకదా!' శ్రీధరరావు నవ్వాడు.

'కట్నం అడిగారనేనా నీ కోపం!'

'అడిగారని కాదు. కట్నంకోసం మూర్ఖపు పట్టు పట్టి అవతలి వ్యక్తి జీవితం నాశనం చెయ్యడానికికూడా జంకక అమానుషంగా ప్రవర్తించినందుకు.'

'మరి ఒప్పుకున్న కట్నం ఇవ్వ నక్కర్లేదా?'

'పరిస్థితులు తెలిసికూడా అలా మాట్లాడతారేమిటి? వివాహంనాటి ముందురోజే కదా దొంగలుపడి నాలుగువేలూ ఎత్తుకుపోయారు. మళ్ళీ అంతడబ్బూ ఇవ్వాలంటే మాటలు చెప్పడమా? పోనీ ఎగవేస్తామేమో అనే భయం ఉంటే నోటువ్రాసి ఇస్తామన్నారుగా! అదేమీ వీల్లేదు. నాలుగువేల రొక్కంతో వస్తేనే ఈ యింట్లో మీ అమ్మాయి అడుగు పెట్టవలసిందనే క్రూరులు మనుష్యులేనా?' ఉద్రేకంతో జానకి ముఖం ఎర్రబడ్డది.

'జానకీ!' కోపంగా అన్నాడు జానకి మామగారి అనుంగు కుమారుడు. 'పెద్దల్ని అలా దూషించడం నేను సహించను.'

'పెద్దలు మీవాళ్లేనా, మావాళ్ళని దూషించినపుడు వాళ్లు చిన్నలా?' శ్రీధరరావు ముఖం వాడిపోయింది.

కోపంతో ఎర్రబారిన జానకి ముఖం ఆమె సహజసౌందర్యాన్ని మరింత ప్రస్ఫుటం చేస్తోంది. రక్తిమ చెంది వణకుతూన్న ఆమె పెదవులను చూసి శ్రీధరరావు సమ్మోహితుడయాడు.

'జానకీ, ఈ రాత్రివేళ గడచినవన్నీ తవ్వ కోటం ఎందుకు? ఏదోవిధంగా సమాధానం కుదిరిపోయిందికదా—' ప్రేమపూరిత స్వరంతో అన్నాడు.

'లేదు. సమాధానం కుదరలేదు. జానకి మీకు కావాలని ఉంటే మీరు కట్నంమీద ఆశ వొదులుకోవాలి.'

'అదేమిటి, నాలుగువేలకు చెక్కు తెచ్చావు కదా?'

'తెస్తేనేం, మళ్లీ వాపసు చేయవచ్చు.'

'వాపసా, ఎందుకూ?'

'జానకి కట్నంతో రాదు.'

'ఏం?'

'ఆమెని మీరు డబ్బుకోసం పెండ్లి చేసుకోలేదు గనక. ఆత్మాభిమానం గల యే స్త్రీ తనకి డబ్బుకి లంకె వేయడం సహించదు. దక్షిణ ఇచ్చుకుని చేసే కాపురం లేకపోతేమాత్రం ఏం?'

'అయితే మరి ఎందుకు వచ్చావు?' విసుగ్గా అన్నాడు శ్రీధరరావు.

'మీ మనస్తత్వం ఎలాంటిదో గ్రహించటానికే. తలిదండ్రులకు తగిన కొడుకులని తెలుసుకోగలిగాను భగవంతుని దయవల్ల.' మిగిలినరాత్రి ముళ్ళమీద ఉన్నట్టు గడిపింది జానకి.

మర్నాడుపొద్దున, 'బాబూ, బండి తీసుకురా' అన్న జానకి మాటలువిని ఆశ్చర్యపోయింది ఆమె అత్తగారు.

'అదేమిటమ్మాయీ, బండి ఎవరికి?'

'మాకేనండి.' ఈ మాటలువిని జానకి మామగారు చదువుతున్న పేపరునుంచి చూపు మరల్చ

లించి జానకివంక చూశాడు. శ్రీధరరావు తల వంచి చదువుతున్నట్లు నటిస్తున్నాడు.

'ఎందుకూ?' ఆశ్చర్యంగా అడిగింది అత్తగారు.

'కట్నం బాపతు బాకీ దమ్మిడీ మిగిలినా ఈ ఇంట్లో నడవడానికి మీ కోడలికి అర్హత లేదన్నారుగా!'

'సరి. ఇప్పుడా గొడవెందుకు? ఏదో మాటా మాటా వచ్చి అన్నామే అనుకో. అదేదీ ఒరిగి పోయింది కదా!' అన్నారు జానకి మామగారు.

'కట్నం బాకీ దమ్మిడీకూడా తీరలేదు, తీరదు' అన్నది జానకి దృఢంగా.

'ఏం!' దిగ్భ్రమచెందిన ఆమె అత్తమామలు ఒక్కసారిగా అన్నారు.

'ఆ చెక్కు మారదు.'

'ఎందుకు?' నాలుక తడి ఆరింది జానకి మామ గారికి.

'డబ్బులేదు.'

'ఆఁ. ఇంత మోసమా!' మండిపడ్డాడు నిరాశోపహతుడైన జానకి మామగారు.

'ఎంత అన్యాయం!' ఆమె అత్తగారు నోరు నొక్కుకుంది.

'మీరు చేసిన పనికంటె ఇది ఎక్కువ అన్యాయం కాదు. ధనాశావశులై తోటి మనుష్యుల జీవితాలను మొదలంటు నరకడానికి సిద్ధపడినవారికి ఎంత అన్యాయం జరిగినా అది న్యాయమే. ఎంతగా అంతరాత్మ క్షోభిస్తే నేనిలా మాట్లాడగలుగుతున్నానో గ్రహించండి.'

'సిగ్గు లేకపోతే సరి. చేసినపనికి సిగ్గుపడక తగుదునమ్మా అని వాదనకూడా ... ఛీ, ఛీ' అత్తగారు చీదరించుకుంది. జానకి ఆమెవంక ఒకసారి చురచుర చూసి మామగారితో అంది-

'మీరు చేసిన అన్యాయానికి త్వరలో ఫలితం అనుభవించబోతున్నారు. క్రిమినల్ కోర్టులో వియ్యంకుల సమావేశంకోసం ఎదురుచూస్తూ ఉండండి.'

'ఆఁ!'

'అవును. ఫోర్జరీనేరం బనాయించ బోతున్నారు మీమీద.'

'ఫోర్జరీ!'

'అప్పుడే బెంబేలుపడకండి మరి. ప్రాసిక్యూషన్ కథనం యిది టూకీగా—కట్నం డబ్బు ఎగేశారనే కారణాన దశరథరామయ్య అనే ఒకాయన తన కోడలిద్వారా ఆమె తండ్రిగారి చెక్కుపుస్తకం దొంగిలింపించి దొంగసంతకం చేసి వసూలునిమిత్తం తనబ్యాంకర్లకు పంపాడు'

'హుఁ. కలికాలం. సాక్ష్యం!'

'నేనే. మూడురోజులక్రితం మీరు మాఊరికి వచ్చినట్టుగాకూడా సాక్ష్యం ఉంది.'

'నువ్వు ఆడదానివేనా! సిగ్గూ, బిడియం లేకుండా కోర్టుకెక్కుతావా?'

'నాకు అన్యాయంచేసిన రాక్షసులకి తగిన పాఠం చెప్పడానికి నేను ఏదీ లెక్క చెయ్యను. ఎలాగో నాజీవితాన్ని ధ్వంసంచేశారు. ఇహ నేను భయపడవలసినది ఏదీలేదు, నన్నీస్థితికి తగిమిన మీ నేరం ఎంతగొప్పదో ఆలోచించుకోండి.'

'ఛీ-నోరుముయ్యి.' కళ్లెర్రచేశాడు జానకి మామగారు.

'మర్యాదగా మాట్లాడండి.' ఉద్రేకం అపుకో లేక జానకి మామగారు తటాలున కుర్చీనుంచి లేచి చేయెత్తాడు.

'నాన్నా!' జానకిభర్త కంఠం అరిచింది. శ్రీధరరావు ప్రయత్నం లేకుండానే. చేయి దించాడు ముసలాయన, చేసేదేమీలేక.

'మేజిస్ట్రేటుకోర్టులో బల్ల ఎక్కటానికి అంత ఆత్రుతగా ఉందా?' జానకి అపహాసం చేసే స్వరంతో అంది.

'అక్కా, బండి వచ్చింది.' జానకి చిన్న తమ్ముడు లోపలికి వెళ్ళి సూట్‌కేస్ పట్టుకు తయారయాడు.

'జానకీ.' హీనస్వరంతో అన్నాడు శ్రీధర రావు ప్రయత్నంమీద. తీక్ష్ణంగా శ్రీధరరావు వైపు చూసింది జానకి. నిప్పులు చెరిగే ఆకళ్ళ వైపు చూడలేక శ్రీధరరావు ఆకాశంవంక చూస్తూ అన్నాడు.

'ఎక్కడికి?'

... జవాబుచెప్పింది జానకి.

'ఇది ... కాదా?' సాహసించి అన్నాడు శ్రీధరరావు.

తెలుగు విశ్వవిద్యాలయ
గ్రంథాలయం
గ్రంథస్వామ్య సంఖ్య ...175...
తేది 15...86...

'కాదు.'

'నీకు చాలా అన్యాయం చేశాం జానకీ.'

'ఓహో! పశ్చాత్తాప పడుతున్నారా? పాపం! ఎందుకులెండి అంతక్రమ-అంతా మించి పోయింతర్వాత ఏమనుకుంటే ఏంలాభం-ఎలాగా ఛార్జీ తప్పదు.'

'ఆవిషయం నేను మాట్లాడడంలేదు. నీమనసు ఎంతబాధ పడ్డదో నేను గ్రహించక పోలేదు. చేసిన తప్పును దిద్దుకోవడానికి నువ్వు అవకాశం ఇవ్వాలి.'

'ఎందుకీ కల్ల బొల్లి కబుర్లు. పద, బాబూ—'

'జానకీ, నామాట విను—ఇంట్లోకి పద.'

'నేను ఆట బొమ్మనని కాబోలు మీ అభిప్రాయం.'

'కాదు. అందుకే చెపుతున్నాను, ఇంట్లోకి పద-సావకాశంగా మాట్లాడదాం.'

'క్షమించండి. డబ్బు మనుష్యులతో నాకేమీ పని లేదు.'

'అందుకనే లోపలికి పదమన్నాను.' కొంచెం తీవ్రంగానే అన్నాడు. అధికారస్వరం వినగానే జానకికి ఒళ్లు మండింది.

'ఏమిటీ అధికారం!' సూటిగా ప్రశ్నించింది.

శ్రీధరరావు జానకి కళ్ళలోకి చూస్తూ అన్నాడు నిశ్చలంగా—

'జానకీ! నీమీద నాకామాత్రం అధికారం లేదా?'

నిశ్చేష్టంగా జానకి శ్రీధరరావు ముఖంలోకి చూసింది.

'అక్కా, బండివాడు తొందరచేస్తున్నాడు' అని ఆమె తమ్ముడు చేయిపట్టుకు కదలించేదాకా జానకి ఈ ప్రపంచంలోకి రాలేదు. సజలనయనాలతో అంది—

'బాబూ, పెట్టె లోపల పెట్టించు.'

# ఆధ్యాత్మిక బోధనలా ఇప్పుడు కావలసింది?

యస్. యస్. నారాయణ

కొందరు పేర్కొనుచున్నట్లు ప్రస్తుతము మన దేశములో విపరీతముగా చెలామణిలో నున్న అవినీతి, నైతికపతనము ప్రజలకు ఆధ్యాత్మికజిజ్ఞాస తగ్గుటవలన సంభవించినవి కావు. వివిధరకములైన రాజకీయముల పరిజ్ఞానము ఏమాత్రములేని పూర్వకాలమున సైతము అప్పుడప్పుడు దేశములో ఇట్టి ఒడుదొడుకులు సంభవించియుండుట మనము ఎరిగియే యున్నాము. జనబాహుళ్యములో నిత్యపరివర్తన చెందుచున్న ఆధునిక సమాజములో ఆందోళనకరమైన మార్పులు కలుగ వచ్చుననుట సరికాదు.

ఆధ్యాత్మికతత్త్వమును పాలుపోసి పెంచిన మన దేశచరిత్రను బ్రిటిషు దేశచరిత్రతో పోల్చి చూచినచో, చరిత్ర మనయెడల చూపిన చిన్న చూపు వ్యక్తముకాకమానదు. బ్రిటిషువారి చరిత్ర ప్రజలెప్పుడు నిరంకుశత్వమునకు వ్యతిరేకముగ పోరాడుట. వారు మనవలె కేవల ఆధ్యాత్మిక జీవులు గారు. ఈ లోకములో తమ బ్రతుకు నుచ్చస్థితికి తీసుకొనిపోవు ప్రయత్నమే వారి నిత్యజీవితసమస్య. మన చరిత్ర చూడుడు. మహమ్మదీయులు ఈ దేశమునకు రాకపూర్వము దేశము అనేక స్వతంత్ర భాగములుగా చీలి, వాటిలో వాటికి ఐకమత్యములేక అశాంతికి నిలయమై యుండెడిది. మహమ్మదీయ యుగములో సైతము ఎపుడో ఒక అక్బరు వంటి వాని పాలనమందు తప్ప ప్రజలు సౌఖ్యముగా బ్రదికి నట్లు మన మెరుగము. బ్రిటిషువారి సవతితల్లి ప్రేమను వేరుగా చెప్పబూనుట సాహసము. వారి చల్లనిచూపు ప్రభావమును నేటికిని కొన్ని సమస్యలలో మనము చవిచూచుచునే యున్నాము. పైగా నాటిపాలకులలో సైతము ఈ జడత్వము దాపురించినది. మహమ్మదీయులు పొంద

త్రైనవారి దాడినుండి దేశమును కాపాడుటకు వారొకనాటికి ఏకముకాలేదు. ఫ్రెంచివారు, ఆంగ్లేయులు మున్నగు పాశ్చాత్యులు వర్తకార్థము మనదేశమునకు వచ్చినపుడు, అడిగినదే తడవుగా వారికి స్థావరములు ప్రసాదించి, తరువాత పెద్దలను చేసినదియు వారే. మనదేశమును జయించి, కొల్లగొట్టు నుద్దేశముతో యిచటకు వచ్చి విఫలమనోరథులై పోయినవారిని మన మెరుగము. తమ దేశమును ఎవ రెట్లు చేసినను వారికి పనిలేదు. ప్రజలలో కొందరు లౌకికవాదులు రాజ్యాంగాది వ్యవహారములలో జోక్యము కలిగించుకొన్నను, పరరాజుల పంచన జేరి దేశద్రోహమునకు కొడిగట్టినను జనసామాన్యము మాత్రము– 'దేశము ఏగంగలో కలసిన మనకేమి, మనకు మోక్షమువస్తే అంతే చాలును' అను మనస్తత్త్వము గలవారైయుండిరి. ప్రజలు ఆధ్యాత్మిక జీవనమే ప్రధానముగా గల్గిన మతముల కానాడు దాసులై యుండిరి. కాని వక్రమార్గము బట్టిన చరిత్రగమనమును మార్చు వీరులు లేకపోయిరి. పరలోక సంబంధమగు విషయములలో గల ఆసక్తి నిత్యజీవిత సంబంధములైన వ్యవహారములలో వారికి లేదు.

ప్రపంచచరిత్రలో ఇట్టి పరిస్థితులు సంభవించుట ఇది మొదటిసారి కాదు. కాని ఎట్టి పరిస్థితులందును, లోకము రాజకీయనాయకుల కృషివలన యథాస్థితికి వచ్చినదికాని, ఆధ్యాత్మిక గురువులు దేశవ్యవహారములలో జోక్యము కలిగించుకొని, శాంతిని స్థాపించుట మన మెరుగము. గాంధీజీవంటి నాయకులు ఎట్టి పరిస్థితులందును ఆధ్యాత్మిక నాయకుల సాయమును వేడినదిలేదు. నేడైనను మనదేశ దుస్థితికి నెహ్రూ, జయప్రకాశ నారాయణ మొదలగు రాజకీయ నాయకులే ఆందోళన పడుచున్నారుగాని, 'కేవలము ధర్మసంస్థాపనార్థమై రాజకీయములలో జోక్యము కలుగజేసుకొని, సమసని తీరగనే తిరిగి ఆధ్యాత్మిక ప్రపంచములోనికి మరలిపోవుదు'రనెడి రమణమహర్షి, అరవిందుడు మొదలైన మత జిజ్ఞాసువులు ముందుకు వచ్చుటలేదు ('తెలుగు స్వతంత్ర'-మే 13). ఇది భౌతిక విషయములందు వారికేమాత్రపు టాసక్తి కలదో వ్యక్తపరచుచున్నది. మైనా మంచూ ప్రభువుల పాలనక్రింద అవినీతికి నిలయమై యున్నప్పుడు దానిని క్రమమైన స్థితిలోనికి తీసుకొని వచ్చినది, ఫక్తు రాజకీయవాది-సర్ యెట్-సేక్. లోకపు భయంకర స్వరూపానికి రోసి, దీని మరమ్మతు మాత్రము తనపని కాదనుకొని, ఒక్కరుగా రాజకీయములనుండి తప్పుకొనిన అరవిందులు ఎప్పటివారో కారు. కనుక మొదటినుండియు లోకచరిత్రను సరిదిద్దినవారు రాజకీయనాయకులు, మేధావులు- ఆధ్యాత్మిక గురువులు ఏమాత్రము కాదు.

విద్యారణ్యులు, సమర్థ రామదాసస్వామి- మహమ్మదీయ ముష్కరులవలన పతనావస్థలో నున్న దేశము. మతము, సంస్కృతి మొదలగు వానిని కాపాడుటకై-ఆవేశమువలన దేశవ్యవహారములలో జోక్యము కలిగించుకొనిరి. కాని ప్రజలందరి క్షేమమును కోరి వారట్లు చేయలేదు. శివాజీ, రామరాజు మున్నగువారి పాలనలో అన్యమతస్థులు, ముఖ్యముగా మహమ్మదీయులు వారివలన పొందిన సత్కారములు మన మెరుగుదుము. నేడును మతలక్ష్యములతో దేశభక్తుల ముసుగు వేసుకొని రాజకీయములలో ప్రవేశించువారు లేకపోలేదు. మన దేశ విభజనను యిట్టి ప్రబుద్ధులే ముఖ్యకారకులు.

వివేకానందాది మహానాయకులను యిట్టివారితో పోల్చుట వారిపట్ల అపచారమగును. సాటి మానవుల దుర్భరస్థితికి కన్నీరు నైతము గార్చిన ఘట్టము లనేకములు ఆయన జీవిత చరిత్రలో గలవు. కాని జనులలో ఆధ్యాత్మికత తగ్గిపోవుటను ఆయన యెన్నడును వాపోయినది లేదు.

సమాజము ముందుకు నడచు యత్నములో, ఆధ్యాత్మికతత్త్వమును ఒకదశలో జనులలో అత్యధిక ప్రచారమును కలిగియుండును ననియు; పాశ్చాత్య దేశములు నైతము ఒకప్పుడు యిట్టి స్థితిలో ఉండినవేననియు–ప్రఖ్యాత రాజకీయ తత్త్వజ్ఞులు యం. యన్. రాయ్ చెప్పియున్నారు. ఆధ్యాత్మికతత్త్వము ధనిక, వర్గమువారి ప్రచారాంగమని కూడ వారే సెలవిచ్చిరి. కనుక, ఇదికూడ నేడు బహుళ ప్రచారములో నున్న సోషలిజము, కమ్యూనిజముల

వంటి ఒక తాత్కాలిక విధానమే కాని సమాజములో శాశ్వతముగా నుండునది కాదు. నేడు మనదేశము ఈ దశను గడచి ముందుకు పోవుచున్నది.

లౌకికసూత్రము లట్లుగాక శాశ్వత ప్రయోజనము గలవి. ప్రపంచము కొన్ని నైతికమైన బాధ్యతలకు కట్టుబడియే ఎక్కువగా నడచుచున్నది కాని, కేవలము రాజకీయ శాసనములకు కట్టుబడి మాత్రమే కాదు. ప్రజలు నీతివంతులుగా నుండుటకు ఆధ్యాత్మిక జిజ్ఞాస కలిగినవారై యుండవలెననుట సత్యదూరము- గొప్ప ఆధ్యాత్మికజ్ఞాని యైన ఘోరకార్యములు చేయజాలడని ఎవరును ఋజువు చేయజాలరు. ఆధ్యాత్మికతత్వమునకు పూర్తిగా వ్యతిరేకులైన లెనిన్, కారల్ మార్క్సు మున్నగు మహనీయులు ఎట్టి ఆదర్శజీవితములు గడపినది మన మెరుగుదుము. నేటి ప్రపంచములో శాంతి స్థాపనకొరకై మనసార ఆందోళన చేయు మేధావులందరును ఆధ్యాత్మికతత్వము కలవారని ఎవరును చెప్ప సాహసించరు.

కనుక నేడు దేశములోని కల్లోలమునకు నైతికప్రమాణముల లోపము కొంత కారణ మనవచ్చును. కాని ఆధ్యాత్మిక జిజ్ఞాస లేకపోవుట మాత్రము కాదు. నాటికి నేడు స్వతంత్రమును పొందిన మన దేశము ఒక్కమారుగా భూలోక స్వర్గముగా మారు ననుకొనుట అసమంజసము. ఏమి చేసినను ప్రజాప్రభుత్వ మూదుకొనుచున్న దను ప్రజల అలక్ష్యమును దీనికి కొంత కారణము కాకమానదు. పార్టీలోని కాలుష్యమును, ప్రజలలోని అవినీతిని ముందు నిర్మూలించక- ప్రభుత్వము రాజకీయములనే ప్రధానముగా నెంచుట, ప్రజాహిత సంస్కరణలను కాలనియమము లేకుండ వాయిదాలు వేయుట- లౌకికజీవితమును పతితము చేయుటకే సాయపడినవగును. కాని, ప్రజలలో శాంతిని ప్రవృద్ధము చేయుటకు మాత్రము కానేరవు. ప్రజలు, ప్రభుత్వము ఆత్మపరిశోధన చేసికొని దేశమును ముందుకు నడపిన మనము బాగుపడుదుము. దేశమును ఆధ్యాత్మిక నాయకుల కొప్పగించి, చరిత్రను వెనుకకు నడుప యత్నించుట జరుగని పని.



“నవజీవనం” తమిళచిత్రంలో అభినేత్రి జయలక్ష్మి

జిజ్ఞాస

# పరబ్రహ్మం తత్వం

"మానస్స"

ఔను. నిజంగానే. పరబ్రహ్మం, సుదీర్ఘాలోచన తర్వాత, తాపీగా ఘాటుగా వెలిబుచ్చే ప్రతీ అభిప్రాయంలోటీ ప్రపంచంలో అనుభవం గల ప్రతీమానవుడూ అంగీకరించవలసిందే. సాధారణంగా ఏవిషయం విన్నా వెంటనే తన ఉద్దేశం తెలియబర్చడు. 'మూడో ప్రపంచయుద్ధం వచ్చేలావుంది' అంటే వూరుకుంటాడు. ఏమీ మాట్లాడడు. నాలుగురోజులు పోయాక ఏ పేకాట దెబ్బలాట సమయంలోనో హఠాత్తుగా - 'మూడో ప్రపంచయుద్ధం రాదోయ్ - ప్రపంచ పరిస్థితులు వీలుపడనివ్వవ్' అనేస్తాడు. ఈ తాడుకి బొంగరం నాలుగురోజులక్రితం ఎవరో అన్నమాట.

వివాహాలూ, యువకులూ, ఆదర్శాలూ వీటిని గురించి చర్చలో ఓసారి అన్నాడు - యువకులు తమ ఆశయాలు నెరవేర్చుకోగల మనోబలం వట్టిపోకపాటు. ఎన్నో కలలు కంటూంటారు. అవన్నీ మేడల్లాగ స్థిరంగా ఉన్నట్లు కనిపిస్తాయి. సఫలమై పోతాయి అనుకుంటూంటారు. తమ ప్రాణమిత్రుడన్న వాడితో 'ఒరేయ్ ఫలానా అమ్మాయిని ప్రేమించానురా. ఆమె నాకోసం ఏ త్యాగమైనా చెయ్యటానికి సిద్ధంగా వుంది. ఏమంటావ్' అంటారు.

'పెళ్ళిచేసుకో' అంటాడు వాడు, తను వాడు కాదుకనక, ఆసమస్య తనది కాదు కనక - ఏదో ఆదర్శాన్ని నిలబెడుతున్నా ననుకొని.

'ఔను, అదే ఆలోచిస్తున్నాను' అంటాడు.

'పదిహేనురోజు లవుతుంది, ఇరవైరోజు లవుతుంది, నెల్లాళ్ళవుతుంది. ఇంట్లో పెళ్ళిగొడవల చర్చ లవుతున్నాయని తనకి తెలుసు. కాని తనేం పట్టించుకోడు, గదిలో కూర్చుని మహావ్యథ పడిపోతాడు. పోనీ పడిపోతున్నా ననుకుంటాడు. ఇంట్లోవాళ్ళు చివరకి వాడితో చెప్పేస్తారు ... 'అమ్మాయీ - అయిదువేలూ, పట్టుపంచలూ, వెండిచెంబులూ...' అని మాట్లాడడు. ఒకవేళ మాట్లాడినా 'ఇప్పుడే యెందుకు పెళ్ళి? అంటాడు. అంతే, జరిగిపోతుంది. స్నేహితులంతా బాగానే వుందంటారు. అంతా అప్పుడే నాడి ప్రేమవిషయం మరిచిపోయారు. పెళ్ళయిపోతుంది దిగ్విజయంగా. మరో రెండేళ్లు పోయాక ఎవరితోనో అంటాడు -

'అచ్చే, యిష్టం లేకపోతే తల్లిదండ్రుల అభిమతానికి బలయిపోకూడదు యువకుడు... ఉదాహరణకి నేనున్నా ననుకోండి ..' తను జీవితంలో ఓ అమ్మాయిని ప్రేమించాననీ, తన పెళ్ళి తన కిష్టంలేనిదనీ గొప్పగా చెప్పుకుంటూంటాడు...

సుదీర్ఘోపన్యాసం అవుతూంటే వెంకట్రాముడు కసిగా అన్నాడు-'ఇష్టమన్నది వుంటే మార్గమే లేదంటావా?' ఆంగ్లసామెతని తర్జుమా చేస్తూ.

'ఏం రామకృష్ణ ఉదాహరణ చాలదా?'

వెంకట్రాముడు తొట్రుపడ్డాడు—'అది వేరులే... అయినా పట్టుదలతో—'

'ఏం, రామకృష్ణ కన్నానా ఏమిటీ? ఓయబ్బో' ఈసడింపుగా అనేశాడు. మరి మాటాడలేదు వెంకట్రాముడు. సభికులు నోరెత్తలేదు. ఒక్కసారి పరబ్రహ్మం గర్వంగా ఎడంకన్ను చిటించి సిగరెట్ పొగ చిక్కగా వొదిలాడు.

* * *

నాకు తెలుసు, పరబ్రహ్మం తన పాయింటు నెగ్గించుకునేందుకు జరిగిన విషయాన్ని కాస్త తప్పు బద్దీలు తొక్కిస్తూంటాడని. అంతా జరిగిన విషయం జరిగినట్లుగానే చెప్పేస్తూ ఎక్కడో పెడతాడు చిన్నముడి-దాంతో అతను రాదల్చుకున్న అభిప్రాయానికి చక్కగా అమరిపోతుంది ఉదాహరణ. అయినా రామకృష్ణుడి విషయం ఏమిటో నామనస్సు చాలా పీకింది. సంగ

లేమిటో తెలుసుకుందామని మూడోరోజు పర బ్రహ్మం దగ్గరి కెళ్ళాను.

విషయాన్ని ఎలా ఎత్తడమో బోధపడింది కాదు. 'ఏమిటీ రామకృష్ణ సంగతి?' అని ప్రశ్నించాను అంటే తెలుసు, ఏం జరుగుతుందో-'ఆఁ ఏముందీ - వాడి ప్రేమా, పెళ్ళి సంగతి. చివరకి వచ్చినట్లు పెళ్ళి చేసుకున్నాడుగా పక్కింటి అమ్మాయిని' అని ఊరుకుంటాడు. నాకు కావలసింది 'చివరకి' ముందు జరిగిన సంఘటనలు- వాటి విషయం నోరు మెదపడు.

అందుచేత, ఓ పద్ధతిలో ప్రశ్నలు ప్రారంభించి, చివరకి వాణ్ణి ఉపన్యాసధోరణిలోకి దింపాలి.

'మొన్న నువ్వన్నదాంతో పూర్తిగా ఏకీభవిస్తేనే బావుంటుం దనితోస్తోంది.

ఏ విషయం?'

'అదీ- పెళ్లిళ్ళూ, ప్రేమా గురించి.'

'కాదు మరీ. మనం గాలిలో ఆలోచించి లాభంలేదోయ్. కూర్చుని ప్రేమగాథలు వ్రాయటం అనుకున్నారు కాబోలు. సమస్య ఎదుర్కొన్న వాడికి తెలుస్తుంది దానిసత్తా. చూడు. రామకృష్ణ పేరెత్తగానే ఒక్కడేనా నోరెత్తేడేమో. అంతే తక్కున మందులా కట్టింది జాడ్యం.'

'అయితే రామకృష్ణ విషయంలో ఏదో కాస్త గొడవ జరిగిం దన్నమాట.'

'కాస్త ఏమిటీ బోలెడు గ్రంథం.'

ఆగాడు. నా ప్రాణం గుటుక్కుమంది. ఇంక వీడేమీ మాట్లాడ్డేమో ఆ విషయం——

'నీకు తెలియదన్నమాట అయితే' అన్నాడు మళ్ళీ.

'అబ్బే...అసలు తెలియదు' తొందరగా అన్నా.

'ఏముందీ- కాలేజీలో రాధని ప్రేమించాడు. ఓ సంవత్సరం గడిచిన ప్రతీవాడూ కాలేజీలో ఇదే అనుకుంటూంటాడు - తను ఎవర్నో ప్రేమించానని. రాధది అసలే తలతిరుగుడు వ్యవహారం. తెలుసుగా నీకు ఆమెసంగతి? సరే- మనవాడు కొటనున్నర లేఖలు కురిపించాడు. చివరకి ఆ అమ్మాయి కాలేజీలో వీణ్ణి ఆపి, 'ఏమిటీ గొడవ? ప్రేమిస్తే ప్రేమించు- ఈ ఉత్తరాలెందుకూ వ్రాయటం?' అంది.

'మరి... తెలుపుదుచెయ్యటం ఎలా?' అన్నాడు వీడు ధైర్యం చిక్కబట్టుకుని.

'నాకేం బాగాలేదు ఈవరస' అంది ఆమె.

'నేను మానలేను. నాహృదయరాజ్ఞివి నీవు' అనో ఏదో అనుంటాడు.

వాడు మాత్రం మరెవళ్ళతోటీ చాలాకాలం దాకా చెప్పలేదు తన ప్రేమవిషయం. కాని రాధ ఊరుకుంటుందా - నన్ను ఫలానావాడు ప్రేమిస్తున్నాడు, నాకు ఫలానావాడు ప్రేమ లేఖలు వ్రాస్తున్నాడు అని చెప్పుకోవడం అదో ఆనందం, గర్వం. ఎవడో ఒకడు తన వెనకాల తిరుగుతున్నాడు, తనకు స్థానం గొప్ప వాళ్ళ ప్రపంచంలో ఏర్పడింది అని చెప్పుకుంటూండడం.

సరే, పాకిపోయింది కాలేజీ అంతాను.

సరిగ్గా నేను జోస్యం చెప్పినట్లే అయింది. ఎవరో తేల్చిఅడిగేశారు వాణ్ణి సంగతేమిటీ అని. 'ఛీ' అన్నాడు వాడు...నాకు తెల్సు, వాడలానే అంటాడని...'నేను ఆమెను వెర్రిలుగా ప్రేమిస్తున్నాను' అన్నాడు - పరిస్థితుల్ని ఎదుర్కోవలసి వచ్చినప్పుడు అందరు ప్రేమికుల్లాగా...వాడు రాధని ప్రేమించటం లేదని ఎంతో మందికి హృదయభారం తీరింది. కాని నన్ను మస్కా కొట్టించలేదుగా వీడు! వీళ్ల సంగతి మనకి భూత భవిష్యత్తులు తెలుసు.

'నీకీగొడవలన్నీ ఎలా తెల్సు?' నేను అన్నాను.

'అడ్డు ప్రశ్నలు వెయ్యకోయ్......ఎలా తెలుస్తేయేం? నోరుమూసుకు వినంతే...'

చివరకోరోజున ఆమెను గొడవ తేల్చి వెయ్యమని అడిగేశాడు. ఆమె అన్నదిక దా...'ప్రేమించావు, బాగానేవుంది కాని-మీ నాన్నా అమ్మా ఒప్పుకుంటారా, మా నాన్నా అమ్మా ఒప్పుకుంటారా?'

'ఓస్, అదెంతా?' అన్నాడు వీడు.

'నీదృష్టిలో మీ నాన్నా అమ్మా అంతేయేమోకాని, మా అమ్మా నాన్నా గురించి నువ్వు ఎలా అనగలవ్?'

'అంటే వీటన్నిటికన్నా ప్రేమ గొప్పది కాదా?' అన్నాడు వీడు.

ఆమెకేం సమాధానం చెప్పాలో బోధపడలేదు. 'సరే చూద్దాంలే' అంది ఆమె.

ఒకటి రెండు నెలలయ్యాయి. ఇంకా 'సరే చూద్దాంలే' దగ్గరే వుంది వ్యవహారం. వీడికి ఓపిక తగ్గిపోయింది. ఎందుకో తెలుసా—

ఇంటిదగ్గర ఘోరంగా దెబ్బలాడుతున్నాడు. ఏమయినాసరే వాళ్ళింటిపక్క అమ్మాయిని పెళ్ళాడనని. తన జీవితం అంతటితో ఆఖరు అన్నాడు. నూతిలో దూకుతా నన్నాడు. తను కన్న కలలన్నీ కల్లలవటం ఎంతమాత్రం ఒప్పుకోన నన్నాడు. ఏమీ చదువూ సంస్కారంలేని పిల్లల్ని తను పెళ్ళాడ నన్నాడు. ఇతర ప్రేమికులకీ వీడికీ తేడా ఏమిటంటే, వీడు అందరిలాగ స్నేహితులతో మాత్రమేకాకుండా, నాన్నతోటి కూడా వాదంలోకి దిగాడు.

వాళ్ళ నాన్న ఉపన్యాసాలన్నీ జాగ్రత్తగా విన్నాడు. వినివిని చివర కేమన్నాడో తెలుసా...'పోవోయ్ కుర్ర కుంకా నీ కేం తెలుసు.'

మనవాడికి పిచ్చెత్తింది. చివరికి నాన్నే గెలిచేలా వున్నాడు. నాన్న ఓడిపోతానేమో అని ఎప్పుడూ ఆలోచించినట్లే కనపడదు. తనతో గడ్డిపోచ కిందకూడా ఖాతరు చెయ్యలేదు నాన్న.

వీడికి ఆవేశం అనిపించింది. తన విషయం నాన్నకూడా ఏదో ఆలోచిస్తున్నట్లు కనిపిస్తే వీడికి కాస్త గర్వంగా వుండేది. కాని అదీ దక్కకపోయె.'

చివరికి రాధ అడిగింది వీణ్ణి-'నీ పెళ్ళెటగా?' అని.

'ఎవరికీ, నాకా?' అన్నాడు.

'చాల్లేవోయ్. ఊళ్ళో అందరికీ తెలిస్తే దసు తెలియదట...భయమెందుకూ...చెప్పు నా దగ్గర.'

'నిజమే. మా నాన్నా అమ్మా పట్టుదలగా ఉన్న మాట వాస్తవమే.'

'అయితే, ఓస్ ఇకెంతా దగ్గరనుంచి ఇక్కడ కొచ్చావన్నమాట.'

'అయితే నేను వాళ్ళమాటలకి లొంగిపోతా ననేనా నీ వుద్దేశం!'

రాధకి ఏం చెప్పాలో తోచింది కాదు. 'సరేలే చూద్దాం' అంది.

రామకృష్ణుడికి, తన ప్రేమని నిలబెట్టుకోవటంకన్న, మాట నిలబెట్టుకోవటం అవసరమైంది చివరకి.

సరాసరి నాన్నదగ్గరికి వెళ్ళాడు. 'నాకీ పెళ్ళి అక్కర్లేదు' అన్నాడు.

'మరి?' అన్నాడు నాన్న.

'అసలు చేసుకోనే చేసుకోను' నాన్నతో రాధని ప్రేమిస్తున్నానని మాత్రం చెప్పడు. అసలు పెళ్లే చేసుకోనూ అని ఎవరేనాఅంటే, ఒకటే నిర్ణంచేసుకో-వాడు పోరాటంలో సగం అప్పుడే ఓడిపోయాడని.

'తరవాత?' అన్నా నేను.

'తరవాత ఏముంది? పెద్దలు నిశ్చయించిన శుభ ముహూర్తానికి దిక్కులుపిక్కటిల్లే సన్నాయి రండోళ్ళతో, సకుటుంబంగా వచ్చిన బంధుమిత్రుల సమక్షాన రామకృష్ణ పక్కయింటివారమ్మాయిని చక్కగా పెళ్ళి చేసుకున్నాడు.'

'రాధ ?'

'నేను రామకృష్ణ విషయం మాట్లాడుతోన్నది. రాధెవరు? కథలో ఎప్పుడో ఐపోయింది ఆ పాత్ర...'

'మరీ-?'

'మరీ లేదు గిరీ లేదు. ఇంతేరా అబ్బాయ్. పిల్లు తెలివితక్కువగా ప్రేమించాం అనుకొని నలుగురితో చెప్పుకునేటందుకు. స్నేహితులే మనుకుంటారో తెలుసా...రామకృష్ణా, రాధా విపరీతంగా ప్రేమించుకున్నారనీ, అసలు పెళ్ళి అయిపోయేదేకాని వాళ్ళనాన్న ద్రోహి అయి ఇదంతా చేశాడనీ. మరోరెండేళ్లు పోయాక— నేను రాధను ప్రేమించే రోజుల్లో...అని ఉపన్యాసం దంచడానికి బోల్డంత మేటరు.'

'అదికాదురా...మరీ ప్రేమించి పెళ్లి చేసుకున్న వాళ్ళసంగతి? ఉదాహరణకి రమణ ఉన్నాడనుకో—'

పరబ్రహ్మం ఏమీ తడుముకోలేదు. 'వాళ్లు మానవాతీతుర్రా ...' సమస్య తేల్చేశాడు. చిక్కు విడిపోయింది. 'కాకపోతే వాళ్ళనాన్నలు పట్టి చవట లన్నమాట.'

ఇంతకీ రామకృష్ణ యీ విషయంలో ఎక్కడ నన్ను పట్టాలు తప్పించాడో బోధపడలేదు. ఎక్కడో తప్పించే వుంటాడు. వాడితత్వమేఅంత.




అటువంటి ప్రదేశంలో సైతం మనుష్యులు యిళ్లు కట్టుకొని జీవిస్తున్నారంటే అంతా ఆశ్చర్యపోతారు. అది ఒరిస్సా సముద్రతీరాన ఏకాంతంగా ఉన్న ఒక ప్రదేశం. బాలసోర్ అనే పట్టణానికి ఎనిమిదిమైళ్ళ దూరం. అక్కడున్న చిన్న చిన్న బంగాళాలన్నీ మిషనరీవాళ్ళవి. నేనుండే బంగాళా ఒక ఎత్తయిన ప్రదేశంపై ఉంది. పైనుండి సునాయాసంగా అన్ని దిక్కులు కనిపిస్తాయి. విశాలమైన సముద్రం, పొర్లు కొస్తున్న నల్లటి నీలిరంగు కెరటాలు, వాటి మధ్య సాయంకాలపు సూర్యుడు అస్తమించే దృశ్యం, ఆముందు విశాలమైన యిసుకమైదానం, ఆపై చివరుగా అనేకమంది పల్లెవాళ్లు, కొంత దూరంలో అడవులు. చీకటి క్రమంగా అడవులపై ప్రాలుతూవుంది. ఆ కనిపించే గుడిసెలన్నీ పల్లెవాళ్ళవి, అది అంతా దిక్కుమాలిన తోట వలె వుంది. బాగా పెరిగిపోయిన చెట్లమయం. అది ఎవ్వడిచేత పెంచబడకుండా దానంతటదే నిర్లక్ష్యంగా పెరిగినట్లుంది: వివిధజాతుల చెట్లు, గుబురుచెట్లు, పుట్టలు, గుట్టలు, అల్లుకుపోయిన తీగెలు, ఎఱ్ఱటి పండ్లగుత్తెలు గల బెర్రీ చెట్లు, తెల్లటి పువ్వులు అంతులేకుండా పెరిగి ఉన్నాయి, ఆమధ్య చిన్న చిన్న నీటి కొలనులు, వంకర టింకర కాలిబాటలు. అదిఅంతా శాంతివంతంగా, రమ్యంగా కనిపిస్తుంది. ఇంకా చిఱుతపులులు, దుప్పులు, ముళ్ళపందులు అందులో స్థాన మేర్పరచు కున్నాయని వినికిడి. నాలో నేను విచిత్రనంగా చిత్రించుకుంటున్నాను- ఒక చిఱుతపులి పొదనుండి వస్తూ వున్నట్లు, ఒకజింక నీళ్ళప్రక్కగా నిలబడినట్లు.

ఇంతలో నాగస్వరం ఎక్కడనుండో విని పిస్తూంది. అది ఒక పాములవాడి వాయిద్యం. ఆవైపే చూచాను. అతడు నాబంగాళాను చేరే దారినే వస్తున్నాడు. పొడుగుకు తగ్గ అందం అతనిలో ఉంది. అతని ప్రక్కన వృద్ధాప్యంలో వున్న ఒకస్త్రీ, ఆమెకూడా మంచి పొడగరి. ఆమెలో ఒకప్పటి చక్కదనం శిథిలమై ఉంది. వాళ్ళిద్దరూ సమీపించగానే తల్లీ కొడుకులని చెప్పటానికి ఎంతో సేపు పట్టదు. వాళ్ళిద్దరూ మెల్లగా సలాములు చేశారు. అతడు అంత కుఱ్ఱవాడు కాడు, ముదుసలివాడు కాడు- యిరవై సంవత్సరా లుంటాయి- అతని గొంతుక వినయాన్ని, మర్యాదను ప్రకటిస్తోంది. 'పాములను ఆడిస్తాను- దయవుంచి చూస్తారా మహారాజ్!'' అంటూ ప్రశ్నించాడు. నేను పాములాట లిదివర కనేక పర్యాయములు చూశాను. కాని అదేమిటో గాని మళ్లీ చూడాలనే అభిలాష ఎప్పటికీ వదలదు.

అతడు బుట్టలన్నీ క్రిందకు దించాడు. వాటి చెంతనే కూర్చొని, నాగస్వరపు కాయ నోట పెట్టి పాట పాడటం ప్రారంభించాడు. ఒక్కొక్కటిగా పాములు బుట్టలనుండి వస్తూన్నాయి. అవన్నీ అతని శరీరానికి మెడకూ చుట్టుకుంటున్నాయి, క్రిందకు జారిపోతున్నాయి. అతడు చుట్టూ ఒక పర్యాయం చూశాడు- నోటినుండి నాగస్వరపు కాయ తీసి ఎవ్వరినో

మూలం : స్నేహాలతా సేన్ అనువాదం : మరడాని సీతారాం

ముద్దుగా పిల్చాడు: "రా, రా, చంద్రుడా! ఎచ్చట దాగావు, సాముద్దుల చిట్టీ- నీ ఆటను మహారాజుకు ఒకమారు చూపు." అతడు నాగస్వరపుకాయ నోట పెట్టి పాట ప్రారంభించాడు. చాలా తొందరగా పాడుతున్నాడు. ఆగకుండా వెర్రి వెర్రిగా యింకా పాడుతూనే ఉన్నాడు. అతను పాడుతూ ఉంటే గంభీరంగా ఉంది. అంత ప్రయాసపడి పాడటం దేనికి! నాగస్వరంలో మంత్రశక్తి అనేది ఉంది. ఆ శక్తి వాటిని స్వాధీనం చేసుకుంటుంది. కాని నేను ఆశ్చర్య పోయాను- ఎంతో సేపటినుంచి పాడుతున్నా ఏ పాములోనూ ఏమీ కదలిక కనిపించలేదు. మరి ఆ మంత్ర విద్య ఏమయిందో- అన్ని యథాప్రకారమే పడి వున్నాయి. అతని పాట మరింత శ్రుతిమించి పోయింది- యింకా వెర్రిగా పాడుతూ ఉన్నాడు. ఇంతలో ఒక తెల్లటి పాము బుట్ట నుండి చల్లగా వచ్చింది. దానిమీద మచ్చలు ఏమీ లేవు- మీగడ తెలుపు రంగు. దానిచర్మం చాలా మృదువుగా ఉంది- అటువంటి తెల్ల పాము నే నిదివర కెన్నడూ చూడనే లేను. అది చూట్టానికి చాలా చక్కగా కనిపించింది. నేను ఆశ్చర్యపోయాను- నాదృష్టి అంతా దానిమీద లగ్నమై పోయింది. అతన్ని ప్రశ్నించాను. "ఈ పాములన్నీ మనుష్యులు చూస్తున్నట్టే చూస్తున్నాయి." అతడు నోటనున్న నాగస్వరపుకాయ తీసి "మహారాజ్! మనుష్యుల ఆత్మలు యీరూపంలో బంధించబడి ఉండవచ్చు; మన ఆత్మలన్నీ రకరకాల రూపాల్లో ముక్తి వచ్చేవరకు బంధింపబడి ఉంటాయి' అని సమాధానమిచ్చాడు. నేను యిటువంటి సమాధానం అతని నుండి వస్తుందని అనుకోలేదు-అతడు చెప్పినది విని నిర్ఘాంతపోయాను. పాములవాడినుండి ఏదో సాధారణమైన జవాబు వస్తుం దనుకున్నా. కాని అతని సమాధానం నాలో చాలా ఆశ్చర్యం కలిపించింది. సాధారణంగా హిందువులందరి నమ్మకం యిదే-ఈ వేదాంతాన్నే అనేక సమయాల్లో చెప్పటం పరిపాటి. 'అది నీ నమ్మకమా! ఐతే జంతువులకు ఆత్మ అనేది లేదనే మనం నమ్ముతున్నాం కదా' అని నేను ప్రశ్నించాను. 'మహారాజ్! అది ఎలా చెప్పగలం!—మీ నమ్మకాలన్నీ పూర్తిగా వ్యతిరేకంగా ఉన్నాయి. మీరు చెప్పింది నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది. మనుష్యజాతి పుట్టింది కోతులనుండి - అటువంటప్పుడు జంతువులకు ఆత్మలేదని చెప్పడంలో ఆధారంలేదు' అని అతడు నన్ను ఎదుర్కొన్నాడు. ఆ పామువైపే చూస్తూ నిశ్శబ్దంగా ఉండిపోయాను. దానికళ్లు వజ్రాలవలె మెరుస్తున్నాయి. 'ఇది చూట్టానికి చాలా అందాగా, ఉంది, సాధారణమైన పాము కాదు' అని, అతనితో చెప్పాను. 'అవును మహారాజ్! ఇటువంటిదే ఒకటి ఉండేది. దాని కథఅంతా మీకు చెప్తాను. అది నిజంగా జరిగిందే. దేవుడికి తెలుసు-దాసితో మీ అపనమ్మకాలన్నీ పోతాయి' అని సమాధానమిచ్చాడు. 'పాము గురించేనా?' అని అడిగాను. 'అవును మహారాజ్ - మీరు వింటానంటే చెప్తాను' అని ఆ పాములన్నింటిని బుట్టలో పెట్టాడు. 'సరే' అని వింటానికి సమ్మతించాను. 'అమ్మా నువ్వుకథ బాగా చెప్పగలవు' అని తల్లిని కథ ప్రారంభించ మన్నాడు - ఆమెరూపం, సొగసైన ఆకృతీ చూస్తే సరిహద్దు రాష్ట్రంలో కనిపించే అనాది ఆర్యుల మనిషి వలె ఉంది. ఆమె తెల్లటివెంట్రుకలు మెరుస్తున్నాయి. ఆమె రెండుచేతులు ఒడిలో పెట్టుకొని, 'నేనే కథ చెప్తాను' అని తన శ్రావ్యమైన కంఠంతో ప్రారంభించింది.

'నా భర్తకు ముగ్గురు భార్యలు, అతడు పాములమంత్రగాడు- వాళ్ల పూర్వవృత్తికూడా అదే. అతనికి చిన్నతనంలోనే మొదటి పెళ్లి చేశారు. ఆమెకూడా అపల్లెలోనే పుట్టి పెరిగింది. అతడు ఆమెను ఎంతో గౌరవించేవాడు. ప్రేమించేవాడు- ఆమెకు భయపడేవాడు కూడాను. ఎన్నాళ్ళకీ బిడ్డల కలగలేదు. ఎవ్వరికీ తెలియకుండా అవూరు వదలి ఎక్కడికో వెళ్ళిపోయాడు- ఐదు సంవత్సరాల వరకు అతనిజాడ ఏమీ తెలియలేదు. ఆమె ఎప్పుడూ అతనిరాకను కోరుకొంటూ, అతనికోసం ప్రతిరోజూ ఎదురుచూస్తూ ఉండేది. ఒకరోజున 'పూజ' పండగముందు, ఒక చక్కటి పరదేశిని వెంటతీసుకుని వచ్చాడు. ఆమె అతని రెండవ భార్య. ఆమె మా కులానికి చెందిందే- కాని ఆమెది చాలా దూరదేశం. ఆమె అందాన్ని

నేను చెప్పాలి అంటే అలవికాని పని. నిజంగా చంద్రుడులాంటి ముఖం. రూపానికితగ్గ సుగుణాలుకూడా ఉన్నాయి. అతని యౌవనాన్నంతా ఆమె అనుభవించింది- కాని అతని మొదటిభార్య కించపడలేదు. అసలు వాళ్ల జోలికే పోయేది కాదు. వాళ్ళను చూచిఅసూయ కూడా పడేదికాదు. ఓర్వలేనితనం ఆమెలో అసలు లేనేలేదు. అతనియందు వాళ్ళిద్దరూ ఎంతో అభిమానం చూపుతూ ఉండేవాళ్ళు. ఇంటిపని అంతా ఆమే చూసుకొనేది- వాళ్ళ సంరక్షణ అంతా తనదే. ఈ విధంగా రెండు సంవత్సరాలు గడచిపోయాయి. ఒక్క కొడుకు కొరకు అపేక్షించాడు- ఒక్కబిడ్డకూడా యిద్దరిలో ఎవరికీ కలగలేదు. మూడోపర్యాయం నన్ను పెళ్లాడాడు. రెండు సంవత్సరాలు గడిచాయి. అప్పుడు నీవు పుట్టావు. నేనెలాగో ఒక లాగున పుట్టింటి వద్ద ఉండేదాన్ని. నేను యిద్దరితోటి కోడళ్ళ మధ్య ఉండడం నా తల్లికి యిష్టం ఉండేది కాదు.

నీవు పుట్టిన తరువాత అతని రెండవభార్య కలరావల్ల చనిపోయింది. భయంకరమైన అంటు రోగం. పల్లెఅంతా గాలించి చాలామందిని తుడుచుకుపోయింది. అతడు ఆమెకొరకు చాలా కాలం విలపించాడు. ఆ తరువాత నేను కాపరానికి వచ్చాను. ఆమె చనిపోయిన తరువాత అతడు పాములాట వృత్తి మానేశాడు. అతనికి నాగస్వరం పాడడం యిదివరకుకంటే యిప్పుడు మరీ ఎక్కువై పోయింది. ప్రతిసాయంకాలం నాగస్వరం పాడటం పరిపాటై పోయింది. సాయంకాలపు నిశ్శబ్దాన్ని భగ్నపరుస్తూ ఉండేవాడు. ఒక ఆశ్చర్యం కలిగేవిషయం- ఒక చక్కటి పాము, యిప్పుడు మీరు చూసిన పాము వంటిదే మహారాజ్, మాచెరువు దగ్గరి పొదలో ఉంటూండేది. ఇంటి ముందు కొచ్చి పడగ పైకెత్తి ఏదో వింటూ ఉన్నట్లుండేది. ప్రతిసాయంకాలం యిలా జరుగుతూ ఉండేది. మేము చాలా ఆశ్చర్యపోయే వాళ్ళం.

ఒకనాడు అతడు దానిని సమీపించాడు. కాని చక చకమని ఆ పొంతనే ఉన్న పొదలోకి పోయింది. ఎవరు దగ్గరకి వెళ్లినా అలాగే పొదలోకి దూరిపోతూ ఉండేది. ప్రతిరోజూ అదే వరస. ఆ పామును అలా విసుగెత్తించడం ఎవ్వరికీ యిష్టం ఉండేది కాదు. ఎవరూ దానిని సమీపించే వారు కాదు. అది పెంపుడు జంతువువలె యింటి చుట్టూ తిరిగేది.

ఇలా పది సంవత్సరాలు గడిచిపోయాయి. అప్పటికి నీకి పదకొండు సంవత్సరాలు. అతడు చాలారోజులు జ్వరంతో తీసుకొని చివరకి మరణించటం జరిగింది. అతని మరణసమయంలో అతని మొదటిభార్య నిశ్శబ్దంగా ఉండిపోయింది. కన్నీరు రాల్చనే లేదు. ఆమె నాతో చెప్పింది- 'చెల్లీ! నేను సహగమనం చేస్తాను, అతనిని కలుసుకుంటాను. రేపే చితి పేరుస్తారు. ఒక్క మాట గుర్తుంచుకో-నన్ను ఆ అగ్ని జ్వాలలు ఆహుతి కొనే సమయంలో ఒక తెల్లటి, పొడుగాటి పాము ఆ చితిలో ప్రవేశిస్తుంది. దానిని చంపవద్దు, కేకలు వేయవద్దు. అది 'హైరా'- అతని రెండవభార్య పరదేశి సుందరి. ఒకనాటి రాత్రి ఆవిధంగా కలగన్నాను.' మహారాజ్, యిది అంతా పట్టి అబద్ధమనుకునేరు. అంతా నిజం. మరునటిరోజున చితి సిద్ధం చేయబడింది. ఎంతోమంది సహగమనాన్ని చూట్టానికి వచ్చారు. పాటలు శాస్త్రాలు ఘోషిస్తున్నారు.

ఆ రోజుల్లో సహగమనం అరుదుగా చేస్తూ ఉండేవాళ్లు. పెద్దావిడ పెండ్లినాటిమంగళసూత్రం యింకావున్ననగలు తీసేసింది; సింధూరం నుదుట ధరించింది- ఆ చితిపై ఆరోహించింది. మహారాజ్! నేను చూసినదంతా చెప్పాను ఆమె పవిత్రమైన సహగమనాన్ని చూడలేకపోయాను. మిగిలినకథ అంతా నువ్వు చూశావు కదా! నువ్వు చెప్పు" అని ఆమె కొడుకును కథ పూర్తి చేయమంది. 'ఆ, నేను చెప్తాను' అని కథ ప్రారంభించాడు.

'మహారాజ్! చాలా మంది సహగమనం చూట్టానికి వచ్చారు. ఆమె చితిప్రక్కన నిలబడివుంది. నిశ్శబ్దం. మంటలుపైకి ఎగబ్రాకిపోతున్నాయి. తెల్లటి పాము, చాలా చక్కటిది-

చితిపైకి ప్రాకుతూ వచ్చింది. అంతా గొల్లుమని గోలచేశారు — పాము, పాము! చంపెయ్యండి, చంపెయ్యండి. అని నేనుఒక్కమారుగా ముందుకు పోయాను. అందరిని ఆపేశాను. చంపవద్దు, చంపవద్దు–అది మాపెద్దమ్మ, మా నాన్న రెండవభార్య- దానిని ఏమీ అలజడి చేయవద్దు, అతనిని కలుసుకుంటానికి పోతూవుందిఅన్నా. ఒక్కమారు అంతా నిశ్శబ్దం తెల్లటిపాము- నెమ్మదిగా చితిపైకి చేరుకుంది. అతనికాళ్ళకు చుట్టుకుంది. అంత్యక్రియలు జరిపే ఆబ్రాహ్మణుడు- యిదిఅంతా ఏమిటి, నాయనా అని ప్రశ్నించాడు. మహారాజ్! నాకేమీ తెలియదు- మాపెద్దమ్మ ముందుగా చెప్పింది, ఆమె ఏమి కోరిందో అదే చేశాను అని సమాధానం చెప్పాను. మంటలు చిటపటలాడుతూ ఉన్నాయి. ఫెళఫెళమని శబ్దం. మంటలు రాను రాను పైకిలేచి పోయాయి. ఆసమయంలో నా ముఖాన్ని రెండుచేతులతో కప్పుకున్నాను మహారాజ్- కథంతా చెప్పాను. ఇది నిజంగా జరిగింది. నేను, మాఅమ్మ యిద్దరం చూస్తూనే ఉన్నాం.'

ఒక్కమారుగా సముద్రం మీదుగా ప్రబల వాయువు వీచింది, తుపాను చెలరేగింది. పాముల వాడికి ఏదో ముట్టచెప్పాను. 'చాలా చీకటి పడిపోయింది- ఈ రాత్రికి యీ బంగాళాలో పడుకోండి' అని వాళ్ళతో చెప్పాను.

అప్పుడప్పుడు ఈకథ నాకు గుర్తుకు వస్తూ ఉంటుంది. ఆ సమయంలో ఆశ్చర్యపోతూంటాను. అతడు చెప్పింది ఎందుకు నిజం కాకూడదు? మరణం అనే రహస్యం యింతవరకూ రహస్యంగానే దాగి ఉంది. చనిపోయి ఈ లోకాన్ని విడిచినవాళ్లు ఒక్కరూకూడా తిరిగి వచ్చి, ఏదారిగుండా ప్రయాణం చేశారో చెప్పారు కాదుకదా!



దక్షిణభారతహిందూస్థానీ ప్రచారసభ స్నాతకోత్సవం

ఇటీవల మద్రాసులో పైసభ వార్షిక స్నాతకోపన్యాసం శ్రీవినోభ భావే యిచ్చారు. పరీక్షలలో నెగ్గిన వారికి ఆయన సర్టిఫికేట్లను అందిస్తున్న దృశ్యం.

# చరమాచ్ఛాదనం

మూలం: ప్రేమచంద్ అనువాదం: 'అన్వేషి'

గుడిసె ముందర తండ్రీ కొడుకులు యిద్దరు ఆరిపోయిన చలిమంటముందు మౌనంగా కూర్చున్నారు. లోపల కోడలు బుధియా ప్రసవ వేదన అనుభవిస్తూంది. ఉండిఉండి ఆమె నోటి నుండి వెలువడే బాధాపూరిత ధ్వనికి ఆ యిద్దరు భయవిహ్వలు లైపోతున్నారు. చలికాలపు రాత్రి. ప్రకృతి అంతా నిశ్శబ్దంగా ఉంది. గ్రామమంతా చీకటిలో కలిసిపోయి వుంది.

'బతికేట్టు లేదు. పగలల్లా పరిగెత్తటంలో గడిచిపోయింది. ఒకసారి చూచన్నా రారా!' అన్నాడు ఘీసూ.

'సచ్చేది, తొందరగా సావరాదూ- సూసి మాత్రం ఏం సేసేది!' అన్నాడు మొగుడు మాధో.

'దయ అనేది ఉండదటరా, నీ గుండెలో? ఏడాదినుంచి దాంతో సుఖించావు. దానికే నంటరా యీ ద్రోహం.'

'దానిబాధ, ఆ కాళ్ళు సేతులు కొట్టుకోటం నేను సూడలే నహో.'

కులం మాదిగ. ఊరంతా చెడ్డపేరు. ఘీసూ ఒకరోజు పనిచేస్తే మూడురోజులు విశ్రాంతి తీసుకుంటాడు. మాధో అంతకంటె పనిదొంగ. అరగంట పనిచేస్తే గంటన్నర చిలుం పీలుస్తూ కూర్చుంటాడు. దీనివల్ల వీళ్ళకి ఎక్కడా కూలి పని దొరికేది కాదు. ఇంట్లో పిడికెడు గింజ లున్నాయంటే పని మొహం చూడరు. రెండు మూడు ఉపవాసాలు చేసిన తరువాత, అప్పుడు తండ్రి ఏదో చెట్టెక్కి నాలుగు పుల్లలు విరుచుకు వస్తాడు. కొడుకు వాటిని అమ్ముకొస్తాడు. ఆ డబ్బు లున్నంతవరకు, యిటూ అటూ గప్పాలు కొట్టుకుంటూ తిరుగుతారు. మళ్ళీ ఉపవాసాల స్థితి వస్తే అప్పుడు కట్టెలు విరుచుకు రావటమో, కూలిపని వెతకటమో చేస్తారు. కూలోళ్ళ పనులకేమీ కొదువ లేదు. రైతు గ్రామం. నడుం వంచి పనిచేసేవాడికి లక్ష పను లున్నాయి. కాని వీళ్ళకు మాత్రం పని దొరకదు. ఒక్కడితో అయ్యే పనిని నలుగురితో చేయించుకోవలసిన అవసరం కలిగితే తప్ప వీళ్ళని పిలవరు. వీళ్ళది విచిత్ర జీవితం. ఇంట్లో రెండు మూడు మట్టి పాత్రలుతప్ప వేరే సంపత్తి లేదు. చిరిగి పేలికలైన గుడ్డముక్కలు కప్పుకు బ్రతుకుతున్నారు. సంసారపు బాధలు లేవు. ఎప్పుడూ అప్పుల్లో మునిగే ఉంటారు. రోజూ తిట్లూ దెబ్బలూ తింటున్నప్పటికీ ఏ చింతా ఉండదు వాళ్ళకు. ముఖాలు ఎంత దీనంగా ఉంటాయంటే, వసూలయ్యే ఆశ లేకపోయినా, ఆ దీనత్వాన్ని చూచి కాస్తో కూస్తో అప్పు యిస్తూనే ఉంటారు ఆ వూళ్ళో వాళ్ళు. ఇతరుల చేనుల్లోని బఠానీలో, బంగాళా దుంపలో ఏవో ఒకటి దొంగతనంగా తెచ్చుకు వచ్చేది, కాల్చుకు తినేది. అదీ లేకపోతే నాలుగైదు చెరుకులు పెరుక్కువస్తారు, వాటితోనే కాలం గడుపుతారు. ఘీసూ యీ ఆకాశ వృత్తితోనే అరవై సంవత్సరాల జీవితాన్ని గడిపాడు. కొడుకుకూడా, తండ్రి అడుగుజాడల్లో నడవడమే కాకుండా, తండ్రిని కూడ మించిపోతూ ఉంటాడు.

ఈ సమయంలో యిద్దరూ చలిమంట ముందు కూర్చుని దొంగిలించి తెచ్చిన బంగాళా దుంపలు కాల్చుకుంటున్నారు. ఘీసూ భార్య చనిపోయి చాలకాలమైంది. మాధోకు క్రిందటి సంవత్సరమే పెళ్లయింది. ఈ స్త్రీ వచ్చినప్పటి నుంచి పిండి విసరటమో, పప్పు విసరటమో, గడ్డి కోసుకు రావటమో చేసి కూటికి సంపాదించుతూ వచ్చింది. ఆమె వచ్చినప్పటినుంచి వీళ్ళు మరీ సోమరిపోతు లైపోయారు. ఎవరన్నా కూలికి పిలిస్తే, ఎక్కడా లేని కూలి అడుగుతారు. ఒక్కొక్కప్పుడు, మాకేమీ యీ కూలి పని చేయవలసిన అవసరం లేదన్నట్లు మాట్లాడటం మొదలు పెడతారు. ఆ స్త్రీ యీ రోజున ఘోరమైన ప్రసవవేదన అనుభవిస్తూంటే వీళ్ళిద్దరూ అదెప్పుడు చస్తుందా, ఎప్పుడు సుఖంగా నిద్రపోదామా అన్నట్లు కూర్చున్నారు.

'పోయి, దాని గతేట్టుందో కొంచెం సూసి రారా!' అన్నాడు ఫీసూ, కాలిన బంగాళా దుంపల తోలు తీస్తూ.

'గతేం దెహే- రాచ్చసత్తి ఉంటుంది, యింకిలా ఉంటాదేం!' లోపలికి పోతే, బంగాళా దుంపల్లో పెద్దభాగం కాజేస్తాడేమోనని మాధోగాడి భయం. అందుకని, 'అసకి పోటానికి నాకు బయంవేస్తావుంది పో హే' అన్నాడు.

'బయం ఏందిరా! నేను యీడనే ఉండానుగా!'

'అయితే నువ్వే పోయి సూసిరాగూడదేం!'

'అరేయి, సిగ్గుందంటరా నీకసలు? మొగం కూడ సరిగా సూడనిదాన్ని, దిసమొలతో ఉండగా సూడమంటావంటరా? నన్నుసూస్తే అది సిగ్గుతో సస్తాదిరా?...నా పెళ్లాం సచ్చినప్పుడు మూడురోజులుదానిదగ్గరనుంచి కదిలితే ఒట్టు.'

'పిల్లో, పీసో పుడితే, యింటో సొంటి, బెల్లం, సమురూ ఏమీ లేదుగందా, మరి ఎట్టాగా అని ఆలోసిత్తాంద.'

'భగవంతుడి దయే ఉండాలగాని, అన్నీ వస్తాయి. యిప్పుడు యియ్యనోళ్ళే రేపు పిల్చి మరీ యిస్తారు దుడ్డు. నాకు తొమ్మిదిమంది పిల్లలు పుట్టారు. అప్పుడూ యింతే. యింటో ఏమి ఉండేది? దేవుడు ఎట్టనోట్ట ఒడ్డు నేసేవోడు.'

ఈ సమాజంలో రాత్రింబగళ్లు కష్టంచేసే వాళ్ళ దశమాత్రం, ఏమంత బాగుంది? కండలను కరిగించి, కష్టపడే కార్మిక కర్షకుల కంటె, వాళ్ల దౌర్బల్యాన్ని సహాయంగా చేసుకుని, వాళ్లదగ్గర నుండి సంపాదించేవారే సంపన్నులై ఉన్నారు. ఇటువంటి సమాజంలో పైనిచెప్పిన మనోవృత్తి గలవాళ్లు పుడుతూంటారంటే ఆశ్చర్యం ఏముంది! నిజంగా ఫీసూ, ఆ విమర్శజ్ఞానశూన్యులైన కార్మికకర్షకుల కంటె, విచారశీలుడనే చెప్పాలి. అందుకనే వాడు విచారశీలుడు కాని ఆ కష్టజీవుల సమూహంలో కలవకుండా, ప్రస్తుత విచారశీలు రనిపించుకొనే తిండిపోతులలో కలుస్తాడు. కాని ఆ తిండిపోతులు పాటించే నియమాలు పాటించని మాట నిజమే.

ఇద్దరూ ఉర్లగడ్డలు వేడివేడివే తినటం మొదలు పెట్టారు. నిన్నటినుంచీ ఏమీ తిన లేదు. అందుకని అవి చల్లారేందుకు పట్టే ఆలస్యాన్నికూడా సహించలేక పోతున్నారు. ఎన్నో సార్లు నాలికలు కాలినయి. తోలు తీసిన ఉర్లగడ్డ పైభాగం మాత్రం అంత వేడిగా లేదు. కాని పళ్లమధ్య పడగానే, లోపలిభాగం దవడలను, గొంతును కాల్చి వేస్తోంది. గొంతులో పడ్డ తరువాత లోపలికి వెడితే అదే చల్ల బడుతుంది. అందుకని వెంట వెంటనే మింగేస్తున్నారు. కన్నుల వెంబడీ, ముక్కుల వెంబడీ నీళ్ళు కారుతున్నా, వాళ్ళు మాత్రం తినటం మానలేదు.

ఆ సమయంలో ఫీసూగాడికి యిరవైసంవత్సరాల క్రితం తను వెళ్ళిన కోటీశ్వరుడైన ఠాకూరుగారి యింటి పెళ్ళి సంగతి జ్ఞాపకం వచ్చింది. వాడి జీవితంలో తృప్తిగా భోజనంచేసిన రోజు ఉన్నదంటే అదే. ఇప్పటికీ వాడికి ఆ రోజు బాగా జ్ఞాపకం ఉంది.

'ఆ భోజనం మర్చిపోలేం రా. మళ్ళీ అటువంటి భోజనమే దొరకలేదు. పిల్ల తరపోళ్ళు అందరికీ పొట్టనిండా నేతి పూరీలు పెట్టారు. చిన్నోళ్ళు, పెద్దోళ్ళు అంతా తిన్నారు. ఆ పచ్చడి, ఆ కూరలు, ఆ పలారాలు, అబ్బ-వాటి రుసి యిప్పుడేం సెప్పేది. ఒద్దన్న కొద్దీ వడ్డేసేవోళ్ళు వడ్డన గాళ్ళు. కూడు తిన్నాం. ఆకులు ఒక్కట్లు యిచ్చారు. నేను మాత్రం ఆకులు వేసుకోలేదు లే. ఆకులకు సున్నం రాసుకునే ఓపిక లేకుండా తిన్నా. ఆపళ్న ఎల్లి కంబడిమీనపడి నిద్రోయాను. ఠాకూరంటే ఎసంటో రనుకున్నావ్.' అన్నాడు ఫీసూగాడు, అటువంటి భోజనం మళ్ళీ దొరుకుతుందా అని ఆలోచిస్తూ.

ఆ మాటలు వింటుంటే మాధోగాడి నోరూరుతోంది.

'యిప్పుడు అసొంటి భోజనం మన కెవ్వరు పెట్తారు?' అన్నాడు నాలిక చప్పరిస్తూ—

'యిప్పు డెవ్వరు పెడ్తార్రా! ఆ కాలమే ఏరు. యిప్పుడంతా పీనాసోళ్లు అయిపోనారు. పెళ్లిళ్లలో కర్చు పెట్టరు, కర్మ, ధర్మాల్లో కర్చు పెట్టరు. బీదోల్ల సొమ్ము యిట్టా అపఅరింతారు గందా! అదంతా యాడ పెడ్తామనో! అపఅరిం

తంలో తక్కువ చేయకూడదు. కాని కప్పు పెట్టటంలో మాత్రం పొదుపు తోస్తాది.'

'ఓ యిరవై పూరీలన్నా తిన్నావా?'

'యిరవై ఏంటేన్! ఎక్కువే తిన్నా'

'నోనైతే యాభైయన్నా తినేవోణ్ణి'

'నేను మాత్రం యాభైకంటె తక్కువ తిన్నానంటా? నాలో సొగం లేదు యాభై తింటానంట, యాభై '

ఇంతలో ఉర్లగడ్డలు తినటం పూర్తి అయింది. ఇద్దరూ అక్కడే, పొట్టల్లో కాళ్లు పెట్టుకుని తమతమ చిరిగిన ధోవతులు కప్పుకుని నిద్రపోయారు.

ఇంకా బుధియా బాధ పడుతూనే ఉంది.

2

ప్రొద్దునే మాధోగాడు గదిలోకి వెళ్ళి, పెళ్ళాం చచ్చిపోయి ఉండటం చూచాడు. ముఖంపై యీగలు ముసురుతున్నాయి. అదివరకు లోపలికి పీక్కుపోయిన కళ్ళు, యిప్పుడు బయటికి వెళ్ళొచ్చాయి. శరీరమంతా దుమ్ముతో నిండిపోయింది. గర్భంలోని పిండం ప్రాణహీనమైపోయింది.

మాధోగాడు పరుగెత్తుకుంటూ ఘీసూగాడి దగ్గరకు వచ్చాడు. ఇద్దరూ రొమ్ములు బాదుకుంటూ ఏడ్వటం మొదలుపెట్టారు. ఇరుగుపొరుగువారు యీ ఏడుపులు విని పరుగెత్తుకొచ్చారు. పూర్వాచారం అనుసరించి అదౌర్భాగ్యులను ఓదార్చటం మొదలెట్టారు.

వీళ్లకి ఎక్కువ ఏడవవలసిన అవసరం కనపడలేదు. ముందు కట్టెలు, శవంమీదికి గుడ్డ కావాలి. వాటికి డబ్బుకావాలి. గద్దగూట్లో మాంసం ఎంత ఉంటుందో, వీళ్ళింట్లో డబ్బు అంతే ఉంటుంది.

తండ్రీ కొడుకులు ఏడుస్తూ ఊళ్లో జమీందారుదగ్గరకు వెళ్ళారు. ఆయనకు వీళ్ళిద్దరంటే పరమాసహ్యం. ఇదివరలో యిద్దర్నీ దొంగతనాలు చేసినందుకు, పనికివస్తామని రాకపోయినందుకు ఎన్నోసార్లు కొట్టాడు.

'ఏంరా ఘీసూ! యిప్పుడెక్కడా కనపడటంలేదే! ఏడుస్తూన్నావేం?' ఆయన అడిగాడు, కొంచెం అసహ్యంగానే.

'ఏం చెప్పేది దొరా! పెద్ద ఆపదొచ్చిపడ్డాది. రేత్రి మాధోగాడి పెళ్ళాం చచ్చిపోనాది. రేత్రల్లా బాధపడ్తానే ఉంది దొరా! ఉన్నకాడికి మందు మాకు యిచ్చినాం, లాబం లేకపోయింది. యింక దిక్కులేదు దొరా! అంతా నాసనమైపోయాం. మీ పాదాలకాడ బతికేవోణ్ణి దొరా! మీరు తప్ప అణ్ణి ఒడ్డు చేసేటి ఓరు దొరా! చేతులో ఉన్నాది కాస్తా మందుకు, మాకుకు అయిపోనాది. మెబువోరి దయుంటేనేగాని, పీనిగ లేవదు దొరా. మీ యిల్లుతప్ప యింక యాడికి పోయేది దొరా!' కళ్లల్లో నింపుకుని, తల నేల కాన్చి, గుక్క తిప్పుకోకుండా, అదివరకే ఆలోచించి పెట్టుకున్న ఆ నాల్గుమాటలు అనేశాడు ఘీసూగాడు.

జమీందారు దయార్ద్రహృదయుడే. కాని వీళ్లమీద దయచూపటం అంటే నల్లగొంగళికి రంగు అద్దటంలాంటిదని ఆయన ఉద్దేశ్యం. 'పోరా, గాడిద! పనికి పిలిస్తే రావు. అవసరానస్తే వచ్చి ఏడుస్తావు పో' అందాం అనుకున్నాడు. కాని యిది దండించవలసిన సమయం కాదు. గొణుక్కుంటూ రెండు రూపాయలు పారేశాడు వాడి మొహాన. మళ్ళీ వాడివైపు చూడనైనా లేదు.

ఘీసూగాడికి జమీందారుగారి పేర దండోరా వేయటం బాగా చేతనవును. జమీందారుగారే రెండు రూపాయలు యిస్తే, అసలు యివ్వకుండా ఉండేందుకు ఎవరికి వీలుంది? అంతా తలా ఒకటి, రెండు అణాలు యిచ్చారు. ఒక గంటలో ఘీసూగాడి దగ్గర ఐదురూపాయల రొక్కం చేరింది. ఒకరు కాసిని గింజలు పెట్టారు. ఇంకొకరు కాసిని కట్టెలు యిచ్చారు. రెండుజాములకు తండ్రీ కొడుకులు శవంమీదికి గుడ్డ తీసుకురావడానికి వెళ్ళారు. ఇక్కడ యిరుగు పొరుగువారు వాసాలు, గిసాలు బిగిస్తున్నారు. ఊళ్ళోని మంచి హృదయంగల స్త్రీలు వచ్చి శవాన్ని చూచి, బుధియా దుస్థితికి రెండు కన్నీటిబొట్లు విడిచి పోతున్నారు.

3

ఇద్దరూ బజారు చేరారు.

'దాన్ని తగలెయ్యటానికి, కట్టెలు సరిపోవంటరా మాధో!' అన్నాడు ఘీసూగాడు.

'కష్టాలు తరిపోతాయి. ఇప్పుడు ఆ గుడ్డ ముక్కే కావాల్సింది-' మాధోగా డన్నాడు.

'అయితే, ఏదోటి నవకరకం గుడ్డ తెద్దాం.'

'అవును, లేకపోతే? చవం లేసే యాలకి ఎట్టాగో లేత్రవృద్ధి. అప్పుడు ఎవడు సూస్తాడు ఆ గుడ్డ.'

'ఏం ఆశారంగా యిది - బతికుండగా మానం కప్పుకోటానికి గుడ్డ పేలికైనా పర్వాలేదు గాని, సత్తే కొత్త గుడ్డ కావా లంటారు.'

'గుడ్డ చవంతో పాటు కాలిపోతాది గందా?'

'మరి లేకపోతే, ఉంటాదంటరా? యీ ఆయిదురూపాయలు గొంగట్లో నే దొరికుంటె, మందో మాకో సూసేవోళ్లం'

ఇద్దరూ ఒకరి హృదయంలో మాట యింకొకరు తెలుసుకుంటున్నారు. బజారులో ఆ కొట్టుకీ, యీ కొట్టుకీ తిరిగారు. సిల్కువి, నూలువి చాలా చాలా గుడ్డలు చేరంచేశారు. కాని ఏదీ నచ్చలేదు. సాయంత్రం అయింది.

ఆ సమయంలో, ఏ దైవప్రేరణో వాళ్ళిద్దరిని కల్లుదుకాణం ముందరికు నెట్టుకుపోయింది. లోపలికి వెళ్లారు. కాసేపు యిద్దరూ సందిగ్ధావస్థలోపడి నిలబడ్డారు 'మాక్కూడా ఒక రొట్టియ్యి' చూసి చూసి ఘీసూగాడు అన్నాడు, కల్లుపోసేవాడి దగ్గరకు పోయి.

దాని తరవాత. కాసిని సీసాలు. కాసిని కాల్చిన చేపలు వచ్చాయి. యిద్దరూ వసారాలో శాంతంగా కూర్చుని. త్రాగటం మొదలెట్టారు.

రెండు మూడు లొట్లు తాగేటప్పటికి నిషా ఎక్కింది.

'గుడ్డకొంటే ఏం వచ్చేదిరా? అది కాలి పోయేదేగా, దానితో ఏమైనా పోతదా!' ఘీసూ అన్నాడు.

'ఏందో, యీ సంప్రదాయం. యీ ల్లు యీ బాపనోళ్లకు ఉపాయాలు ఎందుకు యియ్యటం? పరలోకమంట, పరలోకం. అడ పోటు దొరుకుద్దో, దొరకదో ఎవడు సూశాడు?' మాధోగాడు పైకి చూస్తూ అన్నాడు.

'ఒరే, పెద్దోళ్లకాడ ఉంది, ఊపెత్తారు. మన కాడేముంది, ఊదేత్తానికి?'

'గుడ్డేదని, అల్లడిగితే ఏంసెపుతావే, నాయన!'

'బొడ్డోంచి జారిపోయినయి - ఎంతెతికినా దొరకలేదని సెపుదాం.' ఘీసూ నవ్వుతూ అన్నాడు.

'అల్లు నమ్ముతారంటా?'

'నమ్మకపోయినా మళ్లీ యిత్తారు.'

మాధోగాడికి నవ్వువచ్చింది, ఎంతో అనుకున్నా పట్టని యీ అదృష్టానికి.

'పాపం, బలే మంచి మనిషది. సచ్చేటేల కూడ, యింత బాగ తింటానికి పెట్టే సచ్చింది' అన్నాడు.

మిగిలిన సగం లొట్టి ఖాళీ చేశాడు. ఘీసూ గాడు యింకా రెండు సేర్ల పూరీలు, వాటితోకి మాంసంకూర, చట్నీ, గిట్నీ అన్నీ తెప్పించాడు. ఇక కొద్దిగా మాత్రమే మిగిలాయి డబ్బులు. గుడ్డేదని అడుగుతారని భయంగాని, తిడతారని భయంగాని, చెడ్డపేరొస్తుందనే చింత గాని ఏమీ లేకుండా, అడవిలో సింహం తాను వేటాడి తెచ్చుకున్న ఆహారాన్ని నిర్భయంగా కూర్చుని తింటున్నట్టు, దర్జాగా కూర్చుని తింటున్నారు.

'మన మనస్సు నిండుతుంటే, దానికి మాత్రం పుణ్యం రాదంటరా?' ఘీసూగాడు అన్నాడు. ఆలోచిస్తూ.

'తప్పక రావాలి. యిటువంటి తిండి యీ జీవితంలో దొరికిందా? మేం మనసార ఆశీర్వదిస్తోన్నాం. ఓ దేవుడా! నువ్వు సర్వాంతర్యామివి దాన్ని వైకుంఠానికి తీసుకెళ్లాలి'. మాధోగాడు శ్రద్ధతో తల వంచుకొని నిమీలిత నేత్రుడై అన్నాడు.

ఒక క్షణం తరవాత మాధోగాడికి ఒక అనుమానం వచ్చింది. 'అయ్యా! మనం కూడ ఒకరోజు ఆడకే పోయే వాళ్ళమేగా!' అన్నాడు.

ఘీసూగాడికి ఆ పరలోక విషయాలను ఆలోచిస్తూ, ప్రస్తుత ప్రాపంచిక సుఖాలకు అవరోధం కలిగించుకోటం యిష్టంలేదు. అందుకని యీ అమాయక ప్రశ్నకు సమాధానం యివ్వలేదు.

'అడ యింకేమా గుడ్డ ఎందు కివ్వలేదంటే ఏం సెప్తావు?'

'నీ తలకాయి! అని సెపుతాం. దానికిగుడ్డ దొరకదని నీ కేం తెలుసు? దానికి ఇంతకంటే మంచి గుడ్డే దొరుకుతాది.'

మాధోగాడికి నమ్మకం కుదరలేదు. అందుకని, "ఎవడిస్తాడు? డబ్బు నువ్వు కర్చు పెట్టేశావు. దాని మెళ్లో తాళి కట్టింది నేను. అది నన్ను అడుగుద్ది.' అన్నాడు యేడుపు ముఖం పెట్టి.

'దానికి గుడ్డ దొరుకుద్దని, నీ యెందుకు నమ్మవు?' ఘీసూగాడు తాకెక్కిన కంఠంతో అన్నాడు.

'యెవడిస్తాడో సెప్పవేం?'

'ఎవడేందిరా! యిప్పుడియ్యలా? అట్టే. యీ తడవ మాత్రం డబ్బు మన చేతికి యియ్యరు.'

రాత్రి ఎక్కువవుతున్నకొద్దీ నక్షత్రాల మెరుపు ఎక్కువవుతోంది. దాంతో పాటు కల్లు దుకాణానికి కూడా మెరుగెక్కువవుతోంది. ఒకడు పాడుతున్నాడు. ఒకడు ఏమేమో ప్రేలుతున్నాడు. ఇంకొకడు స్నేహితుణ్ణి కౌగిలించుకొంటున్నాడు. మరొకడు నోటికి కల్లు లొట్టి అందిస్తున్నాడు.

అక్కడి వాతావరణం అంతా నిషాతో నిండిపోయింది. ఎంతోమందికి, అక్కడికి వస్తేనే నిషా ఎక్కుతోంది. కల్లుకంటె అక్కడి గాలే వాళ్ళని నిషాలో ముంచేస్తుంది. జీవితంలోని శ్రమదమాలు వాళ్ళని యిక్కడికి లాక్కొస్తున్నాయి. కాస్సేపటివరకు చచ్చిందీ, బ్రతికిందీ కూడా మర్చిపోతున్నారు.

ఇంకా యీ యిద్దరూ లొట్టెలు వేస్తూ కూర్చున్నారు. అందరిదృష్టి వీళ్ళమీదే ఉంది. పొట్టనిండా తిని, మిగిలింది వాళ్ళవైపు ఆకలిగొన్న కళ్ళతో చూస్తున్న అడుక్కునేవాడికి యిచ్చాడు, ఘీసూగాడు. దానంచేస్తే వచ్చే గౌరవం, కలిగే ఆనందం, ఉత్సాహం, అన్నిటిని వాడి జీవితంలో యిదే మొదటి సారిగా అనుభవించాడు —

'తీసుకో, ఫో. సంపాదించి వచ్చింది. దాన్ని దీవించు, మనసారా దీవించు. నీ దీవెన దానికి తప్పక తగుల్తాది. వైకుంటానికి దారి అయిపోద్ది.' అన్నాడు మాధోగాడు ఆకాశం వంకచూస్తూ.

ఘీసూగాడు లేచి నించున్నాడు. ఉత్సాహపు సముద్రంలో మునకలేస్తున్నాడు. 'ఒకళ్లను యింసించలేదు. వచ్చేయాలకూడ మనకి తృప్తిదీర తినిపించి వచ్చింది. అది కాక పోతే యింకా ఓరురా వైకుంటానికి పోయేది? యీ లావు, లావుటోళ్లు బీదోళ్లను రెండు సేతుల్తో దోసుకుని, ఆ సేతి కంటిన పాపాలను కడుక్కోటానికి గంగలో మునిగేటోళ్లు, గుళ్లలో అబిసేకాలు సేసేటోళ్లు - ఎల్లారంటా వైకుంటానికి?' అన్నాడు నిషాలో మాట తేలిపోతూ.

ఇంక కొంచెం సేపటికి నిషా దిగిపోయింది. దాంతో ఆమాటలమీద శ్రద్ధ మాయమైంది, యిక నిరాశ ప్రారంభమయింది. "అది బతికినంత కాలం బలేకష్టా లనుభవించింది." అంటూ మాధోగాడు బావురుమని ముఖంమీద చేతులు పెట్టుకొని యేడ్వటం మొదలుపెట్టాడు.

"ఎందుకురా ఏడుస్తావు? అది అదురుష్టవంతురాలు కాబట్టి, యీమాయలోంచి విడిపించుకుంది, యింత తొందరగా. సంతోషించాలిరా" అని ఘీసూగాడు ఓదార్చటం మొదలెట్టాడు. ఇక యిద్దరూ లేచి నుంచుని పాటలు పాడటం మొదలెట్టారు.

త్రాగుబోతుల కళ్ళన్నీ వీళ్ళమీదనే ఉన్నాయి. వీళ్ళుమాత్రం ఎవళ్ళని గురించీ ఆలోచించటం లేదు. ఇద్దరూ కాసేపు నృత్యంచేశారు, ఎగిరారు, దూకారు, పడ్డారు, లేచారు. భావభంగిమలు ప్రదర్శించారు, కాసేపు అభినయం పట్టారు. ఆఖరుకు నిషాలో పూర్తిగా వివశులై అక్కడే పడిపోయారు. శవంమీది గుడ్డ అనే మాటకూడ, వాళ్ళతో, అక్కడే పడి ఉండిపోయింది.


"స్వతంత్ర" ఇంగ్లీషు, తెలుగు వారపత్రికలు అమ్మటకు యీదిగువచోట్ల ఏజెంట్లు కావలెను:

| | |
|---|---|
| బళ్ళారి | కలకత్తా |
| చల్లపల్లి | శ్రీకాకుళం |
| మండపేట | నరిసీపట్నం |

తణుకు

మేనేజరు:-

స్వతంత్ర

160, లాయిడ్స్ రోడ్డు,

రాయపేట, మద్రాసు 14.

కథానిక

# యజ్ఞపశువు

మా. గోఖలే.

ఎమ్మే ఫస్టున ప్యాసయిన సుందరం వూళ్ళో వూరికేనే తిరుగుతున్నాడు. వూరికేనే తిరుగుతున్న సుందరాన్ని గురించి ఆవూరి మేలుకోరే పెద్దలకు వివిధాభిప్రాయా లున్నాయి. ఈ అభిప్రాయాల్ని గురించిన అభిప్రాయాలు సుందరాని కున్నాయి.

'నిక్షేపంలాంటి పిల్లవాడు- పాపం- వుద్యోగం దొరక్కుండా వుంది.' పాపం వినబడేట్టు అనుకుంటున్న దావిడ.

తడిగుడ్డతో తలుపు వేయబోతున్న ఆ విధవావిడ— పాపం స్వవిషయం మరిచి దారే పోతున్న తనలాంటివారిమీద సానుభూతి చూపించటం అంత లయయుక్తంగా లేదనుకున్నాడు సుందరం.

'మన సుందరాని కేం వుద్యోగం దొరికినట్టు లేదే, ఖాళీగానే తిరుగుతున్నాడూ?' అన్నాడాయన, కట్టువేసుకు కూచుని అరచేతిలో పొడుం దులుపుకుంటూ.

ఈయన గవర్నరు జనరలుకు సలహాదారుగా పోతే బాగుండునని అభిప్రాయపడ్డాడు సుందరం.

'ఒరేయ్ సుందరం, మావాడు సెక్రెటేరియట్లో వున్నాడని నీకు తెలుసుగా? నువు ప్రయోజనుడ వవుతావని నాకు తెలుసు. పెద్దతనం వచ్చిందిగాని కొంచెం మధ్యమధ్య నీ విషయం జ్ఞాపకం చేస్తుండూ?' ఆప్యాయంగా అన్నాడు సూరయ్యగారు.

ఏణ్ణర్థంనుంచి సూరయ్యగారు తనకీ విధంగా జ్ఞాపకంచేస్తున్నా, ఏరోజు కారోజు కొత్తగా భావిస్తున్న తను, సూరయ్యగారు యీ మాటలు ఎప్పుడు వుచ్చరిస్తున్నా, అమాంతం ఆయన్ని కౌగిలించుకుని ప్రేమకొద్దీ ఆయన మీసాలు దువ్వుతూ సర్వదా ఆయనకు కృతజ్ఞుడనని చెప్పుకుందామనే అభిప్రాయా లున్నాయి సుందరానికి.

'పాపం వాళ్ళ నాయన పిల్లవాణ్ణి దరిద్రుణ్ణి చేసి పోయినాడు గదుటే సుంధరాం!' అని ఆవిడ ఆవిడతో అంటున్నది.

ఇలాంటి మాటలూ వినిపించుకునే సుందరానికి వెంటనే ఆతాలూకు ప్రాణుల రెండు కొప్పులూ పట్టుకుని ఢీకొట్టించే వూహాలూ కలిగేవి.

'అయినా మన సుందరానికి కళ్ళ కద్దుకుని అయిదారువేల కట్నంతో పిల్లల్ని యిస్తారు.' అనుకుంటున్నారు, ఆ ముత్తయిదువులు నలుగురు.

కట్నాలను గురించి ఏ అభిప్రాయాలూ లేని సుందరానికి ఆశ్చర్యం కలిగించేట్టు పై అభిప్రాయాలు ఎప్పట్టుగా అనిపించినట్టుగానే వుండేవి కావు.

ఆ మాట కొస్తే లోగడ సుందరానికి నాలుగైదువేలు ఖరీదుచేసే పిల్లలతో ఆతాలూకు తల్లిదండ్రులు పెళ్ళివిషయమై ప్రాధేయపడటాలు జరగలేదనుకోటం పొరబాటు. 'ఏమిరా నాయనా' అని ఆ సందర్భాల్లో అమ్మ సుందరం కళ్ళ చూసింది కూడా. అదే సమయంలో ఎందుకో మనస్సు చికాకుగా —— కట్నం అనే ముక్క చెవిని పడకూడదనే సుందరం అభిప్రాయం—— వుండి, ఆ చికాకుదృష్టితోనే ఆ పెళ్ళికూతుళ్ళ కొంచెం నల్లనల్లగా వున్నట్టు అనుకున్న సుందరం తనకు పూజ్యురాలైన అమ్మ యిష్ట తను ఆ సందర్భాల్లో నివారించకపోలేదుకూడా.

సుందరం దరిద్రుడు. తనతోపాటు అసంఖ్యాకులుగా దరిద్రు లున్నట్టు సుందరం నమ్మడు. కూలివాడు కనీసం రోజుకు ఒకటిన్నరో రెండో సంపాదించుకుంటాడు. ఒకవేళ సంపాదించుకోకపోయినా వాడికి సిగ్గూబిడియా ల్లేవు. ఆకలితో ఆ రోడ్డుపక్కన, నిశ్చింతగా పడుకుని నిద్రపోగలడు. రైతులు రైతు పడుచులతో పాటలు పాడుకుంటూ, సరసాలాడుకుంటూ ఆపచ్చటి బంగారపు

పొలాల్లో ఆనందంగా జీవిస్తారు. ఆముదప్పుచ్చూ, ఆముదప్పుచ్చు లేకపోతే గొర్రెపెంటా, గొర్రె పెంట లేకపోతే బర్రెపేడా, బర్రెపేడ లేకపోతే పంది పెంటా ఏ ఎరువు వేసయినా పంటలు పండించుకుంటారు. అసలు పంటలే పండకపోతే గాదెల్లో ధాన్యాలుంటాయి వాళ్ళకు. వాళ్లు ప్రకృతి పురుషులు. కోమటి కొట్టు పెట్టుకు బతుకుతాడు. బ్రాహ్మణీకం వున్న బ్రాహ్మణుడు బ్రాహ్మణీకంతో బతుకుతాడు. తన బతుకు నడుమంత్రపుబ్రతుకు.

ఇంతకూ తన కర్మృష్టం లేదు. తప్పు తనది కానేకాదు - వీరేశలింగం అన్నట్టు బహుశ సంఘానికి యిందులో కొంతభాగం వుండవచ్చు. ఎవళ్ళకు వాళ్లు బాగా బతుకుతున్నందువల్లే తన విషయం యీ సంస్థలు పట్టించుకుంటున్నట్టు లేదని కొంత అనుమానానికి తావు లేకపోలేదు. అదే నిజమయితే యిలాంటి చచ్చు సంఘాలతో దేశం చీడపట్టిపోయే అవకాశం వుంది. దేశం మూలకంగా సంఘాలు చీడపట్టి వుంటాయనేది వట్టిమాట. అదే నిజమయితే వీరేశలింగం విప్లవ)మోజకు డన్నమాటే.

స్వాతంత్ర్య దినోత్సవాల్లో రైలుపెట్టెలమీద నెక్కి వుత్సవాల్లో పాల్గొన్న సుందరానికి యీ మధ్యనుంచి పేపర్లను చూస్తుంటే చెమట పోస్తున్నది.

నాలుగున్నర యింటర్వ్యూలకు వెళ్ళి- అర యింటర్వ్యూలో అరంగుళం పొట్టయిన సుందరం టిక్కెట్టులేకుండా రైలెక్కి వచ్చాడు— 'ఇన్ డ్యూ కోర్సు' అనిపించుకుని ఏణ్ణర్ధం ట్యూషన్లు చెప్పి చూశాడు సుందరం. ఏణ్ణర్ధం తరువాత డ్యూకోర్సు పర్మనెంటుకోర్సుఅవుతుందని చెప్పుకునే టైములేదు సుందరానికి.

ఈ సమయాల్లో సుందరానికి మధ్యమధ్య లలిత ప్రత్యక్షమౌతూంటం అంత మంచిగా వుంటంలేదు. ఆనాడు- వాసన భరించలేకనే- అయినా యింతకన్న పోయిం దేముందని కాఫీ హోటలుకు వెళ్ళి కూచుంటే ఒక మంచి నీళ్ళ గ్లాసూ, యింకొక పింగాణీ కప్పూ, దాని తాలూకు సాసరూ చెయి విసుర్లో గచ్చుమీదకు జారటంవల్ల, అయ్యరు ఏదో అంటున్నా విని పించుకోకుండా సర్వర్లతోపాటు అయ్యరును లెక్కకు పెట్టుకుంటూ వచ్చి ఏటిఒడ్డున కూచున్న సుందరానికి లలిత ప్రత్యక్షమయింది.

అసలు ఆడవాళ్ళను గురించి ఎలాంటి మీమాంసల్లోకి దిగని సుందరానికి లలితను గురించి కొంచెం తీవ్రంగా ఆలోచించవలసిన ఆగత్యం ఏర్పడింది.

లలిత అందచందాలు చదువు సంధ్యల్ని గురించి తనకేవిధమైన ఆక్షేపణలులేవని ఆరంభంలోనే చెప్పుకున్నాను సుందరం. అందుకనే గాబోలు ఆ నలుగురు ముత్తయిదువులూ 'యీడూ జోడూ చక్కగా వుంది'...అని అంటుంటే తనకు విన బుద్ధి పుట్టింది!

తమ లలిత పెళ్ళి సమస్యనుగురించి లోగడ పడ్డ బాధలను గుర్తు చేసుకుంటూ దరిద్రులయిన ఆ దంపతులు కాళ్లు పట్టుకోవటమే తరువాయిగా ప్రాధేయపడుతుంటే నీరుకారిన సుందరం ఆ ఆవేదనలోనే పెళ్లికి ఏ ఆటంకాలు లేవని లలిత హృదయాన్ని ఆనంద పెట్టినందుకు గర్వించాడు. వెంటనే తన అమ్మ తలపు వచ్చి సుందరానికి తనను గురించి తనకే ఆశ్చర్యం కలగకపోలేదు.

'ఏమంటావు నాన్నా?' అమ్మ నడిగాడు సుందరం లలితను గురించి.

'పిల్ల కేమిరా, నాయనా. సీతమ్మ తల్లిలా వుంది! వాళ్ల అభిప్రాయాలేమిటో తెలుసుకో వద్దుట్రా సుందరం?' లలిత తల్లి దండ్రులను గురించి విచారించింది అమ్మ.

'వాళ్లందరికీ యిష్టమే నమ్మా'.

'ఇంకా ఎన్నాళ్లురా చిన్నతనం సుందరీ! అల్లుడి ముచ్చట్లు గురించి అనుకోవద్దట్రా నాయనా?'

'వాళ్లంత అంత వున్న వాళ్లు కాదమ్మా' అంటున్న సుందరం గొంతు బిగదీసి నట్టయింది.

'అట్లా అనమాకరా సుందరీ. అయ్యో పిచ్చి తండ్రీ వాళ్లమటు కేంముచ్చట్లుతీర్చుకోకుండానే పెళ్ళి చేస్తారుట్రా!'

'శక్తి లేదన్నా రమ్మా.'

'అయ్యో పాపకర్మం! ఎక్కడన్నా కద్దుట్రా యీ అపచారం! మన ఆచారాలే మంటపెడతావుట్రా నాపిచ్చితండ్రీ. నా కేమన్నా కట్నాల మీద మోజా మంటిగడ్డలా! అయినా యింత

అదేమిటయ మేమిట్రా సుందరీ? ఎంతయినా యీ ప్రాణికి నువ్వేకదా-'

'నువ్వు తప్పు నాకనుటు కెవరున్నా రమ్మా-'

'నా తండ్రీ! ఆయన ఎప్పుడో లేకుండా చేసి పోయినాడు గదా; ఆయనకేం మహరాజు-'

'వూరుకో అమ్మా-'

'అయ్యో శ్రీరామచంద్రమూర్తీ - అట్లాగేలే తండ్రీ - పిచ్చి ముండను ఏదో వాగుతుంటాను - నాయనోయ్ సుందరీ, శాస్త్ర నలుగుర్లో చెప్పు కునేట్టు యీ ప్రాణిని సంతోష పెట్టావా నా కదే పదివేలు; ఆ మహారాజులేని లోపమూ తీరుతుంది. లోవదు సెకండ్రీ చదువుతున్న ఆ నరసమ్మ కొడుక్కి- అరువే లిచ్చి నిక్షేపంగా పెళ్లిచేస్తుంటే యిట్టే ముచ్చటేసింది. నరసమ్మ బతుకున్న తీసిపోయిన బతుకట్రా నాది సుందరీ! మరీ అబ్బరం గాని- ఆ మాత్రమన్నా లేంది ఆడపిల్లల పెళ్ళిళ్లు జరగవని వాళ్లను మటుకు తెలియదూ! రేపు వాళ్లబ్బాయి పెళ్లికిమహా చక్కగా అన్ని ముచ్చట్లూ తీర్చుకుంటారు'.

'వాళ్లబ్బాయి కట్నం తీసుకోకుండానే పెళ్లి చేసుకున్నా ట్టమ్మా'.

'మరీ విచిత్రంరా నీవీ! అయ్యో రామ, నీకూ నాకూ తెలియనిస్తారట్రా పిచ్చినాయనా!'

'ఎట్లాగమ్మా-'

'ఏమిట్రా సుందరీ?'

'మాట యిచ్చానమ్మా-'

'అయ్యో వెర్రితండ్రీ, చిన్నవాడవు నీకేం తెలుసురా మాట యివ్వటానికి- అయినా యిదేం పాపకర్మం మరీనూ! వాళ్లకేం పెద్దావిన్నా పట్టింపు లేదాయేం పాడూ; ఛీ. యిదేంపొయ్యే కాలం - అయ్యో, యిదేం పాపకర్మంరా సుందరి తండ్రీ.'

'నీ యిష్టప్రకారమే లే అమ్మా. ఎట్లా వాళ్లతో చెప్పటం!'

'పసివాడికి మల్లే అదేమిట్రా సుందరీ! ఏదో పెద్దవాళ్ల మాట్లాడుకోకుండానే అయిందా యిదంతా. అయిదువేలూ, పట్టుబట్టలూ, వెండి చెంబులూ ఆ వానపాముల వాళ్ళు యిస్తానన్న వేగా—అయినా మన మేమన్నా యిందులో బావుకునేది వుంటుందా పాడా! ఆఖర్చూ యీ ఖర్చూ అంటూ అంతా పెళ్ళి ఖర్చు కింద చెల్లించుకునేదేగా. పది మందితో కూడు కున్న పని పెళితయితే సిగ్గుచేటు కూడాను కర్మ! ఆ పిల్ల తండ్రి ఎట్లాగో వస్తాడు గనుక నువ్వు మెదలకుండా వుండు—అయినా చిన్నవుంకల కేం తెలుసు పెళ్ళి పేరంటమంటూను! మానాయన యీ శాస్త్రమాటా దక్కించు.'

తనమీద కొండంత ఆశ పెట్టుకున్న తన తల్లి కోరిక ఎట్లా కాదనగలడు సుందరం? లలితతో తన అవస్థ అతిదీనంగా చెప్పాడు సుందరం.

'మా అమ్మ కోరికతీర్చంది ఎందుకునాబతుకు?' అన్నాడు సుందరం.

'మీరు కొంచెం తొందర పడ్డట్టుంది.' అన్నది లలిత తలవొంచుకుని.

'ఏవిధంగా?' అన్నాడు సుందరం ఆతురతగా.

'మీ అమ్మ మనస్సు గ్రహించకుండా తొందరపడి నాన్నస్థితికి ఆశ కలిగించారు.'

'నువ్వు అపార్థం చేసుకుంటావని నాకు తెలిసి మనస్సులో ఎంత బాధపడుతున్నానో నీకు ఎట్లా తెలుస్తుంది? ఇంకో లలితా, కట్నం కోసం యీ పెళ్ళి జరగటంలేదని నువ్వు మనస్ఫూర్తిగా నమ్మాలని నాకోరిక. ఇందుకు తార్కాణంగా అయిదువేలూ అరునేలా కట్నాలిస్తామని వచ్చి నప్పుడు నేను తిరస్కరించినట్టు మీరు విచారించి తెలుసుకోవచ్చు. ఏ అయిగారు వేలతోనో నా పెళ్ళి ఆర్భాటంగా చేసుకుందామని ముచ్చట పడుతున్న మాఅమ్మ నువ్వంటేఎంతోయిష్టంతో యిప్పుడు కొంచెం వేల అయిదువందలతోనే సంతృప్తి పడుతున్నది, పాపం. అమ్మను సంపూర్ణంగా తెలుసుకుని నువ్వు ఎంతఆనందించగలిగేదీ నే నూహించగలను. నలుగురూ పెళ్ళిని గౌరవించాలని యీ కొద్దికోరికతో పాపం ఆవిడ అమాయిక హృదయం ఎంతఆరాట పడుతున్నదో నీకెట్లా తెలుస్తుంది, లలితా? నిజానికి మన ప్రేమకు యీ చిన్నవిషయాలు ఆటంకా లనుకుంటేనే ఆశ్చర్యం వేస్తుంది!'

'మీ అమ్మ ముచ్చట మా కుటుంబానికి ప్రాణసంకట మని మీకు తోచివుంటుందను కున్నా. మాఅమ్మా నాన్నలనూ ముచ్చట్లున్నయి గాని యిప్పుడవి నా పెళ్లి ఎంత హీనంగా జరిగినా తీరేట్టున్నయి. కనీసం ఏ అయిదారువందలతో తాహతున్నా నా పెళ్లి ఎప్పుడో జరిగి పోయే

దని అభిమానం చంపుకుని కూడా మీతో చెప్పాడు నాన్న. మీరు నన్ను చూసే యిష్టపడి పెళ్ళిచేసుకుంటా నన్నందుకు ఎందుకో పట్టరాని సంతోషం వచ్చింది.'

'ఇప్పుడుమటుకు నేను నిన్ను చూసి కాక యింకే వుద్దేశంతో పెళ్లి చేసుకుంటున్నా నను కుంటావు లలితా. నేను నిన్ను కోరేదల్లా అమ్మ కోరికతో నన్ను అంటగట్టక మా యిద్దర్నీ ప్రత్యేక దృక్పథంతో గౌరవించమంటున్నా.'

'నాన్న యీ పెళ్ళి ఆశ వొదులుకున్నాడు.'

'యీ స్వల్ప విషయానికి——!'

'ఈ పెళ్లిళ్లు ఆడపెళ్ళిళ్లేగాని అటా మగ పెళ్లిళ్లుగా లేవంటున్నాడు నాన్న.'

'అంటే—?'

'అంటే ఏమీ లేదు. పెళ్లి వుభయుల అవ సరం అని. ఈసారి పెళ్లిప్రస్తావన వస్తే తన కూతురికి కట్నమిస్తానని వొచ్చేవాడికే తప్ప నన్నిచ్చి పెళ్లిచెయ్యట్ట నాన్న.'

'మీనాన్న మాటలు సబబైనవనే అంటావా లలితా?'

'మానాన్న మాట ఎట్లా కాదనను? నన్ను ఎంతో ప్రేమించి నామేలు కోరతాడు నాన్న.'

ఆవిధంగా తనకు లలిత దక్కకపోవటం ఆట్లావుంచి తరువాత ఒకటిరెండుసార్లు లలిత కనిపించినప్పుడు తనలో జంతువును చూసి నట్టుగా చూసిన ట్లనిపించినందుకు గుండెలో మొల్లుకర్ర పెట్టి పొడిచినట్టయింది సుందరానికి.

'ఛీ, ఛండాలపుబతుకు—' అని బిగ్గరగా చీద రించుకున్నాడు సుందరం, సాయంత్రం వారు వీరంటూ నదికి షికారువస్తారనే గమనికే లేకుండా.

'నువ్వంటున్న బతుకు అన్ని బతుకుల్లోకీ మహో త్కృష్టమైన బతుకుగా దార్శనికు లెప్పుడో నిర్ణ యించారు.' అన్నాడు ఆ వ్యక్తి, తనపక్కన ఎప్పుడు వచ్చి తెలియకుండా కూచున్నాడో కూచుని.

పడిగమీద కొట్టినట్టయిన సుందరానికి ఆ కళ్ల జోడు నుదురు ప్రత్యక్షమయింది.

'పురాతన నిర్ణయాల్ని గురించి కాదులెండి యిప్పుడు మనం విచారించవలసింది' అన్నాడు సుందరం.

'నువ్వు చదువుకున్నా వనుకుంటా?' అన్నాడు ఆ వ్యక్తి.

'లేదా ఏం లేదు' అన్నాడు సుందరం.

'ఇంకేం! అయితే యీనాడు మనం చదు వంటే సంస్కృతని అర్థం చేసుకోవాలి- వాడు చదువుకున్నవా డంటే ఏం లాభంలేదు. ఎందు కంటే- లేకుంటే కొన్ని పశువులకీ, మనకీ అటే లేడా వుండదు.'

'అయితే మానవుడి జీవితం యీనా డెందు కింత దౌర్భాగ్యంగా వుండాలి?'

'యజ్ఞపశు వంటే మీకు తెలుసనుకుంటా?'

'తెలుసు.'

'అవి తాము మోక్షం పొందబోతున్నట్టు భావిస్తాయని కొందరు పెద్దలంటారు. బహుశా అంతేనేమో. అవుతే ఆవిషయం నిజంకాదని ఆ యజ్ఞపశువులకు అనిపిస్తేనుటుకు మరుక్షణం కొమ్ములతో డొక్కల్లో పొడిచి పరుగెత్తుకు వెళ్లి యింతగడ్డి తింటూ తిరుగుతాయి.'

'అచ్చే, మీ రేమిటో విషయంగాని విషయం మాట్లాడుతున్నారు' అని మొహం తిప్పుకున్నాడు సుందరం.



# కాలప్రభావం



'అయితే- చూడండి బాబూ- పెడుతుందని రేషనా, కంట్రోలా?' అన్నాడు ఆదుర్దాతో గొల్ల వెంకన్న.

గొల్ల వెంకన్నకు కడుపులో గుడుగుడుమంటున్నది. సొంతకడుపు కెట్లావున్నా, యింతకు ముందు తింటున్నా తినకపోయినా, గంపెడంత సంసారం నెత్తిన పడ్డతరువాత కన్నకడుపు-బిడ్డల విషయమై వుండబట్టలేదు. అంతకు ముందు తనకడుపుకీ, తన శరీరానికీ తన సుఖానికీ ఎంతగా ఆవేదనపడేవాడయినా, యింట్లో పిల్లా, జెల్లా వరదాగా కనిపిస్తుంటే తన సుఖానికి పడే ఆవేదన క్రమంగా సన్నగిల్లుతుంది.

కరణం యీ కబురు గ్రామమంతా చెప్పి ఉబ్బిపోతున్నాడు. పైగా తన సంతోషం అందరికీ చోద్యంగా వుంటుందనే కారణాన, కబురు చెప్పిన వెంటనే ముఖం తప్పిస్తున్నాడు. అందరికీ కడుపులో గాలం పెట్టి దేవినట్లుగా వుంటుంటే, యీయన కింత సంబర మెందుకో.

గొల్ల వెంకడికి సమాధానం కూడా చెప్పకుండానే—'పోవోయ్ ! నీ కివన్నీ విశదంగా విడమర్చి చెప్పడానికి నీకింద బంట్రోతు ననుకున్నావా!' అని నిప్పులు గక్కుతూ చూచాడు.

'అయ్యో, అంతమాటా, బాబూ- నేనట్లా అన్నానా?' అన్నాడు వెంకన్న ఎంతో తప్పు చేశాననే భావంతో. విసురుగా కరణం వెళ్లిపోయాడు.

ఊళ్లో వర్తకులందరూ దుకాణాల్లోని సరుకంతా ఒకసారి లెక్క చూచుకొని సర్దుకుంటున్నారు, ఏదో మహాప్రమాదం ఎదుర్కోవాలి అన్నట్లుగా. పాతర్లలో పుట్లకుపుట్లు దాచిపెట్టి రేషను లేని కాలంలో కూడా ప్రజానీకాన్ని పీడిస్తూ అమ్ముకున్న పెద్దమనుషులుకూడా కొంత ఆదుర్దా, కొంత సంబరంతో మునిగిపోతున్నారు. ఆ గ్రామాలకు తణిఖీకి రావలసిన ప్రభుత్వోద్యోగులు తమపంట పండిందనే భావంతో కొత్త ప్రాజక్లూ, చొక్కాలూ కుట్టించుకుంటూ మురుస్తున్నారు.

ఒకవంక- అటు ఆస్తిపాస్తులు శూన్యమై, యిటు చేతిలో డబ్బులేక నిరాశతో నింగి వంక చూస్తూ కూర్చున్నారు కొందరు దీనులు. మరొకవంక— ఆస్తులూ, పొలమూ పుట్రలూ లేక-ఏదో ఉన్నంతలో...కొంచెంకష్టంగానే... సంసారనావను నెట్టే ప్రజావళి తమ భావిపరిణామాన్ని గురించి తదేకదీక్షతో ఆలోచిస్తూ, ఏమీ తోచక అటూ యిటూ పచార్లు చేస్తున్నారు.

ఊళ్లో పెద్దమనుషులంతా సాయంత్రంపూట జరిగే మామూలు పంచాయతీల్లో రేషను విషయాన్ని ముఖ్యప్రసంగంగా తీసికొని ఎన్నో వ్యర్థతీర్మానాలు చేయటం ప్రారంభించారు.

కరణంగారు ముసి ముసి నవ్వులతో గ్రామమంతా చుట్టబెట్టి కొంప జేరుకున్నారు. ఎన్నడూ ఆ అలవాటు లేకపోయినా-యింటిలో పిల్లమూక అంతా నాయన తమకేదో తింటానికి తెచ్చాడు గాబోలుననుకొని, ఒకళ్లు-చొక్కా- ఒకళ్లు ధోవతి, మరొకళ్లు కండువా పట్టుకొని

★ పెనుమాక రాధాకృష్ణమూర్తి ★

కుంటుతున్నారు. ప్రతిరోజూ కసురుకొని మీద బడి కొట్టవచ్చే తండ్రి ఆరోజు దరహాసిత వదనంతో పిల్లలవంక ఓక్కచూపు పారవేసివంట యింట్లోకి దారితీశాడు- పెళ్లాం వుండేమోనని. దాంతో పిల్లలు-తండ్రి ముఖవిశేషాన్ని కనిపెట్టి యివాళ యేదో వున్నదనుకొని - తింటానికి మేతకూడా తెచ్చాడనుకొని వంట యింట్లోకి కూడా వెంటబడ్డారు, అల్లరిచేస్తూ. మరుక్షణమే తలకొకటి వడ్డించాడు కరణం. దాంతో పిల్లలు ఉన్న కాస్త విశేషాన్ని అనుభవించి ఏడుపు ముఖంతో వెనక్కు మళ్లారు.

కరణం వంట యింట్లో కాలుపెట్టగానే శూన్యం గోచరించింది. గృహిణి ఎక్కడకు వెళ్లిందో అనే అనుమానం కలిగింది. పొయ్యి మీద పెట్టిన బియ్యం కింద మంట లేదు. కాస్త సేపున్న తరువాత- ఒకక్షణం ఒకయుగంగా గడచిన తదుపరి - కరణం భార్య చంకన నీళ్ల బిందెతో తడిగుడ్డలతో ప్రవేశించింది. ఆయన్ని చూడగానే ముఖం చిట్లించుకున్నది. దాంతో కరణానికి అరికాలుమంట నెత్తికెక్కింది. తాను శుభవార్త కొంపలో పారవేస్తే కొంత బరువు తగ్గుతుందనే ఆశతో యింట్లో ప్రవేశిస్తే, కాలు పెట్టగానే యింట్లో అయిన అపశకునాలు ఒక్కసారిగా సింహావలోకనం చేసుకున్నాడు. ప్రారంభంలోనే పిల్లలు కాళ్ళకు చుట్టుకోవడం-వాళ్లను వదలించుకోటానికై తాను నాలుగు వడ్డించవలసి రావడం; వంటయింటిలో భార్య లేకపోవటం, తనకాక్షణం యుగంగా గడవటం; భార్య వచ్చిన తరువాత తనముఖం చూచి సంతోషించటానికి బదులు, చిట్లించుకోవటం - యివన్నీ అతన్ని ఎంతో కలవర పెట్టాయి.

ఎట్లాగో ధైర్యం తెచ్చుకొని కరణం భార్యతో సంభాషణ ప్రారంభించాడు.

'ఈ సంగతి విన్నావా!' అన్నాడు సంతోషయసాలతో.

'పొద్దున్ననగా యెక్కడికో వెళ్లి యిప్పుడు మళ్లీ కొంపముఖం చూస్తే, సేసే సంగతులు వింటాను మీ దగ్గరనుండి. చాలా మంచివారు గాని యికనన్నాపోయి ముఖం కడుక్కోండి. ఎవరన్నా చూస్తే నవ్విపోతారు' అన్నది తల యెత్తకుండానే.

ఈ మాటతో కరణానికి చీకాకు వేసింది. 'ఎందుకీ బ్రతుకు' అనుకొని మెల్లిగా దొడ్లోకి వెళ్ళాడు. వేపపుల్ల ఒకటి తీసికొని ముఖం కడుగుతున్నాడన్న మాటే గాని, ఎంతసేపటికీ 'రేపను ఎప్పుడు పెడతారో, తాను ఎప్పుడు కోమటింటికి వెళ్ళి గుమ్మంలో నిలబడగానే వాళ్లు వచ్చి సువర్ణపుష్పం చేతిలో పెడతారో' అని ఆలోచిస్తూనే వున్నాడు.

ఎలాగయితేనేం పొచిపోకుండానే ముఖంతో ముకుని మళ్లీ వంట యింట్లో పడ్డాడు. ఈ సారి ఆమె అనుమతి కెదురు చూడకుండానే 'రేపను పెడుతున్నారు - మళ్లీ మన పాలెంలో కూడా; మనపంట పండింది' అన్నాడు, భార్య నుంచి సంతోషంగా రావలసిన సమాధానానికి ఎదురు చూస్తూ.

భార్య చేతులు తిప్పుతూ 'ఆ, మన పంట పండింది. ఎప్పుడయితే బీదవాళ్లు మల మల మాడి చస్తుంటారో, అప్పుడే మనకు కడుపాత్రం ఎక్కువవుతుంది. ఎంతసేపటికీ మన పంటపండిం దనుకోటంతప్ప, వాళ్లపంట పాడవు


# ది ఇండియన్ బ్యాంక్ లిమిటెడ్

హెడ్డాఫీసు : మదరాసు

(Estd:  1907)

జారీచేసి చందావేయబడిన

| | |
|---|---|
| మూలధనం | రూ. 72,00,000 |
| అడిగిన మూలధనం | రూ. 53,00,000 |
| రిజర్వ్ ఫండ్ | రూ. 62,00,000 |

అన్నిరకాల బ్యాంకింగ్ వ్యవహారాలు చేయబడును.

యస్. గోపాల అయ్యర్,

కార్యదర్శి.

తుందనే విషయం ఆలోచించరే, మీ అంతట మీరు!' అన్నది రోషంతో.

కరణానికి తల తిరిగింది. కాని ఎల్లాగయినా వచ్చుచెప్పి భార్యను సంతోషపెట్టాలని ఆలోచిస్తున్నాడు.

సూటుబూట్లతో కొడుకు పట్నం నుండి అప్పుడే యింట్లో ప్రవేశించాడు. ఆయన పట్నంలో చదువుకుంటున్నాడు. కరణానికి గుండెలో గాలం పడ్డది. కొడుకు తన ఆటలు సాగనివ్వడు. ఆయన నవ్య ప్రపంచాన్ని మరమ్మతు చేయటానికి బయలు దేరిన మహాశయుడు. ఎన్నో సమస్యలను గురించి తీవ్రంగా ఆలోచనలు జరుపుతుంటాడు. అలాంటప్పుడు యీ లంచగొండితనాన్ని తన కళ్ళ యెదుట, తన తండ్రి చేస్తుంటే ఊరుకుంటాడా? అబ్బ లాడి ఒంటిగా వస్తే తండ్రిని మార్పించే కార్యధురీణుడు. ఎండాకాలం సెలవుల్లో యింటికి వచ్చాడు. ఈ మూడు నెలలూ యిక్కడే వుంటాడు. 'మూడు నెల్లో... అబ్బ! ఎంత బేరం పోతుంది' అన్నాడు, మనస్సులో- మనస్సు లోనే, కరణం.

లేని చిరునవ్వుతో అబ్బాయికి స్వాగతం చెప్పాడు తండ్రి.

* * *

'ఏనాడూ యిలా అప్పుకడతలేదు. - యియ్యాల్లన్నా ఆ బియ్యం, అటికె యానం సూడవూ' అన్నది వెంకడి భార్య.

'ఎంతో మంచి మారాజులు యిళ్ళలో ముంగిట బెట్టుకొంటుంటే... మీరోళ్ళం... మన కొంపలో వున్న ఆ పుట్టగింజలూ తీసుకపోతారు గదా - బగవంతుడా' అని కళ్ళ నీళ్ళు పెట్టుకున్నాడు, గొల్ల వెంకడు.

నెత్తిన చేతులు పెట్టుకొని కన్నీటి కాల్వ కార్చాడు - అట్టా ఎంతసేపో... మళ్ళీ రోషం వచ్చింది... లేచాడు. 'ఆ బ్లాకుమార్కెట్టుంట... ఆ దయినా సరే... యియ్యాల... తీసుకరావల సిందే. నాయింట్లో... నే బతికుండగా... భార్యా, పిల్లోళ్లు సస్తు పడుకుంటే సూడలేను' అని కండువా మీద వేసికొని తిరిగి సూడకుండా వెళ్ళిపోయాడు.

కోమటి సెట్టి యింటికి చేరాడు. 'సెట్టి గారూ'—అనే వెంకడి పిలుపుకి 'ఆ వత్తుండా' అనే సమాధానం వచ్చింది సెట్టినుండి కాళ్ళా వేళ్ళాపడ్డాడు వెంకడు. విషయమంతా చెప్పాడు విడమర్చి. సెట్టి నాలుగు వైపులా పరీక్షించి చూచి 'సరే - నా యింట్లోవి యిత్తుండా, పని గిద్దలు కాడికి. మరి ఎవరితోనన్నా చెప్తావా?' అని అడిగి 'చెప్ప'నని సమాధానం తీసుకున్నాడు. భద్రంగా రెండు మూడు గదులు దాటి చీకటికొట్లోకి తీసుకువెళ్ళాడు వెంకడిని. సెట్టి, బస్తామూతి విప్పాడు.

'సెట్టీ' అనే పిలుపు వినబడ్డది.

'ఇంకే మంది-కరణం వచ్చాడు పో, యీడ నుంచి' అని కసిరాడు వెంకణ్ణి సెట్టి. చెమ్మగిలిన కళ్ళతో వెంకడు వెళ్ళిపోయాడు. తరువాత కరణం నవ్వుకుంటూ, జేబు తడుముకుంటూ వచ్చాడు.

వెనకనుండి 'ఏరా, వెంకడూ-బాగున్నావా' అనే మాట వినిపించింది. వెనక్కు తిరిగి చూచాడు. కరణం కొడుకు, వెంకడి కన్నీళ్లు చూచాడు. గ్రహించాడు- ఇంటికి తీసికొని వెళ్ళి తండ్రిలేకుండా చూచి బియ్యం కొలిచాడు. డబ్బు ఇవ్వవద్దన్నాడు.

'ఆ రోజు మరచిపోగలనా?' అని ఆలోచిస్తుంటాడు వెంకడు. 'కరణంకొడుకు కడుపులో యింతదయ వుందా' అనికూడా అనుకుంటుంటాడు.

'దేశపరిస్థితి యిదా' అని ముక్కుమీద వేలు వేసికొంటుంటాడు, కరణం కొడుకు.



# జనవాక్యం

సంపాదకునికి ప్రకటనార్థం పంపించిన లేఖలు యీ శీర్షిక క్రింద ప్రచురితమవుతాయి. లేఖలు క్లుప్తంగా, కాగితానికి ఒక పక్క వ్రాసి పంపాలి.

## జిల్లాబోర్డు ఎన్నికలు–కాంగ్రెసు

కాంగ్రెస్ ద్వారా శాసన సభలకు యెన్నుకొనబడిన సభ్యులు కాంగ్రెసు ప్రణాళికను మరచిపోయి, పదవీవ్యామోహంలో బడి గ్రూపులుగా తయారయి, వారివారి బంధుమిత్రుల స్వలాభాపేక్షతో క్రమ విరుద్ధమైన పనులు చేస్తున్నారని ఒకరిపైనొకరు నిందలు మోపుకుంటూ ఆఖరికి హైకమాండు వరకు వెళ్లిన సంగతులు పత్రికలలో తరుచు చదువుచునేయున్నాము. దీనిని బట్టి కాంగ్రెసు ప్రభుత్వమునందు ప్రజలకు దినదినము నమ్మకము తగ్గిపోవుచున్నదని యను మాట అతిశయోక్తి కాదు. ఈ సంగతులుకూడా పత్రికలద్వారా ప్రజలు వెల్లడిస్తూనేయున్నారు. పెద్ద నాయకులని పేరు గాంచిన శాసనసభ్యులే వారివారి స్వార్థపరత్వాలతో కీచులాడుకొంటూ ప్రజలను మరచిపోతే, యిక రాష్ట్ర, జిల్లా, కాంగ్రెస్ కమిటీలు జిల్లా బోర్డు ఎన్నికలలో నిలబెట్టబోయే చిన్ననాయకులను ప్రజలు విశ్వసించి వోట్లిస్తారని భ్రమపడుట హాస్యాస్పదము. అదీగాక కాంగ్రెస్‌లో లేని వ్యక్తులు అనేకులు ప్రజాసేవకులు లేకపోలేదు. కాబట్టి మన రాష్ట్ర కాంగ్రెస్ కమిటీవారు ప్రకటించిన విధముగా కాంగ్రెస్ తరఫున సభ్యులను నియమించుట మానివేసి, వారివారి యిష్టానుసారము సభ్యుల నెన్నుకొనుటకు వోటర్ల కవకాశ మిచ్చుట మంచిది.

ఉజ్జిన వెంకన్న

నిడదవోలు కొవ్వూరు తాలూకా

కాంగ్రెస్ కమిటీ సభ్యుడు

---

## ధాన్యసేకరణ వింతలు

విశాఖపట్నం జిల్లా గొలుగొండ తాలూకా కృష్ణాదేవిపేట ప్రాంతములలో ప్రొక్యూర్‌మెంటు డిమాండు ప్రకారము యిచ్చినప్పటికి మరల డిమాండు ఉన్నదని రేషనింగు అధికార్లు, రెవెన్యూ అధికార్లు, రైతులందరను, నానాహింసలు పెట్టి, దౌర్జన్యముగా ప్రొక్యూర్‌మెంటు చేసి విత్తనములకు, తిండికి లేకుండా ధాన్యం తీసికొనుచున్నారు. పొలము పనిమీద పోయిన కొంతమంది రైతుల తాలూకు యిళ్ళలో చొరబడి తలుపులు పగుల గొట్టించి, ప్రొక్యూర్‌మెంటు చేయుచున్నారు.

పంటలు పండించుటకు అందుకు సరిపడు విత్తనములు కావలయును. విత్తనములు లేనిదే పంటలు పండించు టెట్లు? ఈ విషయమును రేషనింగు అధికార్లు, రెవెన్యూ అధికార్లు గ్రహించేటట్లు చేయు బాధ్యత ప్రభుత్వముపైన ఉన్నది.

కృష్ణాదేవిపేట యల్. గౌరినాయుడు